

Chandamama, April '52 — Photo by A. L. Syed

ఎవరువారు ?

అతి త్వరలో

ఆర్. పద్మనాభన్ వారి

# రాజేశ్వరి

ప్రొడ్యూసర్ & డైరెక్టర్
ఆర్. పద్మనాభన్



శ్రీరంజని
శ్రీరామమూర్తి
మాధురీదేవి
డా॥ సుబ్బారావు
రేలంగి.. కనకం
లంక సత్యం
నటించినది..

## పిల్లలంటే తల్లులకు తీపి
## పిప్పరమెంట్లు పిల్లలకు తీపి

తియ్యని పిప్పరమెంట్లు

MAP

వారిచే

MAP

**M.A.P. INDUSTRIES**
**TONDIARPET, MADRAS. 21**

---

# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4

---

బంగారు కవరింగ్ చేయబడిన RAJA బ్రాండు ఆభరణములు
కందు 10 సం॥ గ్యారంటి

RAJA 237/1 R COLOURED LOLAK Rs. 5-8-0 PER PAIR
NETAJI NEHRU SAIBABA PHOTO RINGS Rs. 3-0-0 EACH
COLOURED STONE RING Rs. 2-12-0. EACH. Rs. 2-0-0 EACH
172/5 3-0-0 SAME MODEL
BABY RING Rs. 1-0-0. EACH
Rs. 2-0-0 EACH
306 PLAIN RING.
RITA SHINGS CHAIN Rs. 2-0-0
CUFF LINKS 371 Rs. 1-12-0
NEHRU KRISHNA NETAJI ETC. 2-0-0
491 PIN 0-8-0 EACH
RAJA 265 RAJA 266 RAJA 265/1. RAJA 265/2
EACH Rs. 1-0-0
POSTAGE EXTRA BUTTONS EACH 0-9-0. Catalogue Free on Application
రాజా గోల్డు కవరింగ్ కంపెని మచిలీపట్నం

రౌండు, బాదం, కాఫీ, చంద్రహారములు, 24" యించి, పేట 1-కి రు. 11/- సావా నల్లపూసల చైను 18" యించి 1-కి రు. 5/- ఫ్లవర్ నల్లపూసల చైను 18" యించి 1-కి రు. 7/8/- ఆర్డరుతో 800 డిజైనులుగల క్యాటలాగు వుచితంగా పంపబడును. ప్యాకింగు పోస్టేజి రు. 1 అదనము

రాజా గోల్డు కవరింగ్ కంపెనీ (రిజిష్టర్డు)
రాజా బిల్డింగ్సు :: మచిలీపట్నం

విశాలాంధ్రలో నేడే చూడండి

భరణీ వారి

# ప్రేమ
"Love"

భానుమతి
నాగేశ్వరరావు

ముక్కామల.. సి.యస్.ఆర్.
శ్రీరంజని (జూనియర్),
రేలంగి...శివరావు
సీతారాం





మ్యూజిక్
సుబ్బురామన్
ఫొటోగ్రఫీ
కమాల్ ఘోష్
పాటలు, మాటలు
... శర్మ ...
ఆర్టు
కె.నాగేశ్వరరావు

స్టూడియో
వాహిని




డైరెక్టర్.. రామకృష్ణ

MATA.

పూర్ణా రిలీజ్:
వివరాలకు: భరణీ పిక్చర్స్, మదరాసు - 17

# చందమామ

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 10 : సంచిక 4

ఏప్రిల్ 1952

ఇటీవల మన చందమామ పాఠకులలో ఒక క్రొత్త ఉత్సాహం బయలుదేరింది. అదే ఒంటిగీత బొమ్మలను చిత్రించటం. ఈ ఉత్సాహం ఏ ఒక్క ప్రాంతానికిమాత్రమే చెందినది కాదు. తెలుగు, తమిళ, కన్నడ, హిందీ ప్రాంతాలలోని మా పాఠకులందరూ సమంగా ఆసక్తి చూపుతూ లెక్కలేనన్ని ఒంటిగీత బొమ్మలు కురిపిస్తూ ఉన్నారు. ఈ బొమ్మలను చిత్రిస్తూవున్న మా పాఠకులు అంచీలమీద ప్రాథమిక దశను దాటేసి, ప్రవీణులైనారనటం అతిశయోక్తి కానేరదు. కూజా బుడ్డితో ప్రారంభించిన మా బాల చిత్రకారులు ఇంతత్వరలో, జిలిబిలిగిలిబిలితో కూడినటువంటి కష్టసాధ్యమైన గణపతి, సరస్వతి మొదలైన బొమ్మలను వేయగల్గుతున్నారంటే, వారిని ఎంతగా అభినందించినా కొద్దిపాటే అవుతుందని మా తలంపు. చిత్రకళా రచనలో ఇప్పుడే తలసూపిన ఈ క్రొత్తశాఖ ఎంతో త్వరితంగా బాలబాలికలలో అల్లుకొనటమూ, అన్నిరాష్ట్రాల వారూ ఇందులోపాల్గొని, ఉత్సాహమూ సమర్థతా ప్రదర్శించటమూ చాల గర్వించతగ్గ విషయం. ప్రతినెలా ఈ విధంగా చందమామను అలంకరించే మా బాల చిత్రకారులు ఈ ఒంటిగీత బొమ్మలేగాక, ఇంకా పలురకాల బొమ్మలు చిత్రించి, గొప్ప చిత్రకారులు కాగలరని మా అభిలాష.








# జోడు కలిసింది

మౌనివరుడు చిట్టి ఎలుక
నొక్కదాన్ని చూశాడు.
దాని నొక్క కడుచక్కని
చుక్కనుగా చేశాడు.

కన్నకూతు రన్నంతగ
మక్కువతో పెంచాడు.
'తగిన వరుడు ఎవడా?' అని
అత డాలోచించాడు.

'గొప్పవాడు అన్నింటను
రవికంటెను ఘనుడెవ్వడు?'
అని కూతురి నిస్తానని
సూర్యుణ్నడిగా డప్పుడు.

అన్నాడు సూర్యు 'డయ్యా!
నాకంటే మబ్బుగొప్ప.
మబ్బుకమ్మితే నాపని
సున్నా చాకిరీ తప్ప.'

మబ్బుల నడిగాడు మౌని.
మబ్బన్నది—'ఏమయ్యా!
నా గొప్పనుగూర్చి నీకు
చెప్పినవా రెవరయ్యా?

రచన :
"బైరాగి"

గాలి విసరికొట్టిందా
దూరమెళ్ళి పడతానే!
నాకంటే గాలి గొప్ప'
అని మబ్బులు అనగానే

మౌని వెళ్ళి వాయువునే
నిలువతీసి అడిగాడు.
తొందరపడవద్దంటూ
వాయుదేవు డన్నాడు.

'మునివర్యా! వినవయ్యా!
నాకంటే గోడ గొప్ప.
గోడ అడ్డమొస్తే మరి
నాకెక్కడ త్రోవ చెప్పు?'

ఇదివిని నిజమేననుకొని
మౌని గోడ నడిగాడు.
గోడన్నది—'నే నెలుకకు
లోకువయ్యా ఏనాడు

నాకంటే ఎలుక గొప్ప.'
ఇదివిని ముని మురిశాడు.
ఎలుకనొకటి తోడితెచ్చి
జోడప్పుడు కలిపాడు.



# 'దంచినమ్మకు బొక్కిందే కూలి'



శేషయ్యశెట్టికి చెన్నపట్నం వెళ్లాలిసిన పని పడింది. మంచిరోజు చూచుకుని స్టేషనుకు బయల్దేరాడు. వాళ్లవూరికి మెయిలుబండి అసలే అర్థరాత్రివేళ వస్తుంది. అందుకుతోడు ఆరోజున బండి నాలుగుగంటలు లేటు. ఇంకా బోలెడంత వ్యవధి వున్నదికదా అని అతడు కాస్త నడుంవాల్చాడు; కునుకు పట్టేసింది.

కొంతసేపటికల్లా బండీ వచ్చింది. ప్రయాణికుల హడావుడికి శెట్టి మేల్కొని, కళ్లు నులుముకొంటూ కంగారుగా వచ్చి చెడి బండీలోపడాడు. కాస్తచోటుచూచుకుని మళ్లీ నిద్రలోపడ్డాడు. తిరిగి మెళుకువవచ్చేసరికి తను ఎక్కింది మదరాసు మెయిలు కాదనీ అది కలకత్తా మెయిలనీ తెలిసివచ్చింది. ఏమిటిచేయటం?

'మంచికో చెడ్డకో రానేవచ్చాం. కలకత్తా చేరువలోనే వున్నదికద! అదృష్టవశాత్తు, ఇప్పటివరకు ఎవళ్ళూ నన్ను టికెట్టుకూడా అడగనేలేదు... సరదాగా కలకత్తాచూచి మరీ పోవచ్చు' అనుకుని ఉవ్విళ్ళూరుతూ వుండేటంతలో కలకత్తాస్టేషను వచ్చేసింది. తను పొరపాటున తప్పుడుబండీ ఎక్కినట్టు స్టేషనుమాస్టరుతో చెప్పాడు శెట్టి.

అందుకు మాస్టరు 'సరేలెండి. పొరపాటు ఎవళ్లకైనా వస్తుంది. మీరు స్టేషనులోనే వుండి, రాత్రి మెయిలుకి వెళ్లండి' అన్నాడు.

'మరి నా భోజనంమాట ఎలా?' అని అడిగాడు శెట్టి. 'ఇక్కడనే భోజనశాల వున్నది' అని సలహాఇచ్చాడు మాస్టరు. ఊరుచూడాలనే ఉబలాటంలో శెట్టికి ఈ సలహా నచ్చలేదు. యుక్తిగా 'అయ్యా! మాకు దక్షిణాది భోజనమే కాని సరిపడదు. ఊళ్ళో ఏదైనా మదరాసు హోటెల్లో తినివస్తా' నన్నాడు. వీలులేదన్నాడు మాస్టరు.

తనపాచిక పారలేదుకదా అని శెట్టికి చీకాకెత్తింది. 'ఈ దరిద్రపు స్టేషనులో చూచేందు కేముందండీ, బస్తీలో తిరిగి రావాలెగానీ!' అంటూ నిట్టూర్చాడు.

మాస్టరు "చాలుచాల్లేవయ్యా, పెద్దమనిషి! తేరగా ఇంతదూరంవచ్చి కలకత్తా స్టేషనైనా చూచానని సంతోషించక, ఊరుచూడలేదని అఘోరిస్తావేం? ఇంకానయం, నిన్ను ఎక్సెస్ చేయాల్సింది. 'దంచినమ్మకు బొక్కిందే కూలి' అని తృప్తిపడి యిల్లుచేరుకో" అన్నాడు. శెట్టి కిక్కురుమంటే ఒట్టు.



# జువ్విచెట్టు ఆత్మ

ఎనిమిదివందల ఏండ్లక్రిందట విక్రమరాజపురంలో ఒక గొప్పదేవాలయం వుండేది. ఆ దేవాలయానికి ముప్పైమూడు మండపాలు ఉండేవి. గోపురంమీది బొమ్మలూ, గుడిలోపలి విగ్రహాలూ కలిసి మొత్తం 33,333 స్వరూపాలు అని వాడుక.

ఈ గుడి కట్టకముందు ఆ సమీపంలో ఒక బ్రహ్మాండమైన జువ్విచెట్టు వుండేది. ఆమడదూరం వ్యాపించిన దాని నీడని చిన్న పిల్లలు ఆడుకొనేవాళ్ళు. బాటసారులు అక్కడ విశ్రమించి అలసట తీర్చుకొనే వారు. గ్రామ పెద్దలు తీర్పులు తీర్చేవారు.

ఇలావుండగా—వంతెన ఒకటి నిర్మించటానికని ఈ జువ్విచెట్టు పడగొట్టమని రాజుగారి ఆజ్ఞఅయింది.

ఆ ఊరిలోనే ఆ జువ్విచెట్టు సమీపాన సుధన్వుడనే ఒక రైతు ఉండేవాడు. "నూరేండ్లు నిండిన ఈ మహావృక్షాన్ని కొట్టి వేయటమా?—ఎంతమంది జీవులకు ఇది అండగావుంటున్నది!—ఎన్ని ప్రాణులకు ఇది ఆనందాన్ని కలిగిస్తున్నది!—ఇటువంటి దాన్ని కొట్టటానికి చేతులెలా వస్తాయి?—దీనిని కొట్టవద్దు. దీనికిబదులు ఎంత కలప కావలిస్తే, అంతా మా తోటలో చెట్లు కొట్టుకుని వినియోగించుకోండి" అని అతడు రాజుకు మనవిచేసుకున్నాడు.

రాజు సమ్మతించాడు. అంతటితో ఈ సమస్య ఆగిపోయింది.

కొన్నాళ్ళయినతరువాత ఒక సాయంకాలం సుధన్వుడు పొలంనుండి ఇంటికి తిరిగివస్తూవుండగా, జువ్విచెట్టుకింద త్రిలోకసుందరి అనతగిన ఒక చిన్నది కనపడింది. ఆమె అపురూపసౌందర్యానికి అతడు నివ్వెరపోయాడు. అతడు పలకరించుదామని అనుకొనేటంతలోనే ఆమె అదృశ్యమైపోయింది.

ముద్దా సోమప్పశాస్త్రి - పరశువాకం




రాత్రిఅంతా అతనికి నిద్దుర పట్టలేదు. 'చిత్రమైన ఈ చిన్నది ఎవరు?—' ఈ సమస్యే అతని మనస్సును పూర్తిగా అపరించేసింది. మరునాడు, మామూలుగా పొలం వెళ్ళాడు. కాని, పని తోచలేదు. సాయంకాలం ఇంటికి వెళ్ళేటప్పుడు మళ్ళీ ఆచిన్నది కనిపించింది. ఆశ్చర్యపోయాడు.

"సుధన్వా!—నీ తాత తండ్రులనుండీ నిన్ను నే నెరుగుదును. నీ కుటుంబం మంచి సంప్రదాయం కలది. నీవు మంచి హృదయం కలవాడవు. ఒక్క వాగ్దానంచేస్తే నిన్ను పెళ్లాడి నీ చరణదాసిగా వుంటాను," అని తనమనస్సు వెల్లడించింది.

"నేను చెయ్యవలసిన ఆ వాగ్దానమేమిటో చెప్పు" అన్నాడు సుధన్వుడు.

అందుకు ఆమె: "ఎన్నడూ నా పుట్టు పూర్వోత్తరాలు నీవు ప్రశ్నించకూడదు. పని కలిగినప్పుడు నాఅంతట నేనే చెబుతాను," అన్నది. అతడు అంగీకరించాడు.

వారికి వివాహమయింది. ఏడాదికల్లా పనసపండువంటి ఒక బిడ్డడు పుట్టాడు. బిడ్డడికి ఐదేళ్ళు వచ్చినై. అల్లారుముద్దుగా పెరుగుతున్నాడు.

ఇంతలో, మునపటిలాగానే, మళ్ళీ రాజాజ్ఞ వచ్చింది–విక్రమరాజపురంలో ఒక గొప్ప దేవాలయం నిర్మించాలనీ, అందుకు గాను ఈ జువ్విచెట్టు కలపే కావాలనీ, ఇందు కెవరూ అటంకపరచకూడదనిన్నీ.

పనివాళ్ళు వచ్చారు. పదునైన గొడ్డళ్ళు తెచ్చారు. చకచకా చెట్టు కొట్టివేస్తున్నారు! ఎన్నేళ్లనుంచో కనుపండువుగా ఆ ప్రదేశ మందు నివసిస్తూ, ఎట్టి ప్రతిఫలమూ అపేక్షించకుండా లక్షలాది జీవులకూ ఆశ్రయ మిస్తూ ఆనందాన్ని చేకూరుస్తూవుండే ఆ మహావృక్షాన్ని తమ వాడి గొడ్డళ్ళతో చకా చకా కొట్టివేస్తున్నారు!! రాజాజ్ఞ!!! ఊం అనటానికి ఎవళ్ళవల్ల నవుతుంది?—

మరికొన్నాళ్ళు గడిచాక ఒకనాటి రాత్రి చెట్టుకొట్టే శబ్దం వినిపించింది సుధన్వుడికి. భార్యవచ్చి అతనిపక్కలోనే కూర్చునివున్నది. కళ్ళనీళ్ళు కడవలకొద్దీ ఆమె చెక్కిళ్ళపైన జారుతున్నై. "సుధన్వా!—ఇది కలకాదు సుమా!— నేను చెప్పేమాటలు నమ్ము; నా మాట యందు గౌరవం ఉంచావు. ఈ ఆరేళ్లనుండీ నా చరిత్ర అడగకుండా ఊరకున్నావు. అయితే, అ రహస్యం వెల్లడించవలసిన అవసరం ఇప్పుడు కలిగింది. నేను ఈ మహావృక్షంయొక్క ఆత్మను. నిన్ను చిరకాలం సేవించుకొని సుఖపెట్టుదా మనుకున్నాను. కాని, విధివిలాసం వేరుగా వున్నది. పనివాళ్లు కొట్టే ఒక్కొక్క గొడ్డలి దెబ్బ చెట్టుకుకాదు, నా శరీరానికి తగులు తున్నది. నేను భరించలేకుండా వున్నాను. నాకు కాలం సమీపించింది. ఇంక కొంచెం సేపటిలో చెట్టు పడిపోతుంది, నేను చచ్చి పోతాను. చిట్టివాడి చేష్టలు కళ్ళారా చూడ గలననుకున్నాను. కాని, నాకు ప్రాప్తం లేదు. నాపేరుగా వాణ్ణి జాగ్రత్తగా పెంచుకో. నీవు మంచి హృదయం కలవాడవు. నిన్ను దైవం కాపాడుతాడు. నాకు సెలవు..."




అంటూ భర్తపాదాలకు భక్తితో నమస్క రించి అంతర్హితురాలయింది.

సుధన్వుడు లేచాడు. బిడ్డడుకూడా లేచాడు. తల్లికోసం ఏడ్చి రాగాలుపెట్టాడు పాపం. తండ్రి ఓదార్చాడు. తండ్రీ, కొడు కులు చెట్టువుండే ప్రదేశం చేరుకున్నారు. అప్పటికప్పుడే పనివాళ్ళు చెట్టు కొట్టివేశారు. సంపద అంతా చెలిపివేసి గుట్టవేశారు. బ్రహ్మాండమైన మొండెం భూమిమీద పడి వున్నది!—

సుధన్వుడూ, కొడుకూ అదృశ్యంచూచి, వలవల ఏడ్చారు. వాళ్ళు ఎందుకు ఏడు స్తున్నారో, ఎవ్వరికీ తెలియదు.

ప్రక్క నున్న నదిలోకి ఆ మాను దొర్లించుకుపోవాలి. పందమంది కలిసి తోశారు. మాను కదలలేదు. ఊళ్లో అందరూ వచ్చి కదిలించారు. అది బెసగలేదు. పైగ్రామాలనుండి మహాబలశాలులు ఎంతో మంది వచ్చారు. ప్రయత్నించారు. లాభం లేకపోయింది. ఏమిటీ, విడ్డూరం!— అందరూ తెల్లబోయారు.

ఆ రాత్రి, రాజుకు కల వచ్చింది. సుధన్వునికీ ఆ మహావృక్షానికీ గల సంబంధం వెల్లడిఅయింది. వెంటనే రాజు మేల్కొన్నాడు. చెట్టు కొట్టవద్దని సుధన్వుడు ఎందుకు ప్రాధేయపడ్డాడో, ప్రజలకు తెలియజెప్పాడు. ఇప్పుడేమనుకొంటే ఏమున్నది?

రాజు సుధన్వుడి క్షమాపణ కోరాడు. సుధన్వుని సలహాపైన అతివైభవంగా పూజలు ఉత్సవాలు జరిపించాడు. మాను మళ్ళీ కదిపిచూచారు. కదలలేదు.

అప్పుడు సుధన్వుడు, బిడ్డడితో: "నాయనా!—అమ్మను పలకరించు, తండ్రీ!—నీవంటే అమ్మకు ప్రాణం. నీమాట కాదనలేదు" అన్నాడు.

తండ్రి కోరినప్రకారం అప్పుడు చిట్టివాడు మానుపైన చెయి వేసి: "అమ్మా!—అమ్మా!—" అని పిలిచాడు. ఆ వెంటనే, మాను కదిలింది.

వేలకొద్దీ బలశాలులు మెటికరించలేని ఆ మాను చిట్టివాడు చెయివేయగానే, ఇట్టె కదలటంచూచి అక్కడ చేరినవారంతా నిశ్చేష్టులై జలజల కన్నీరు రాల్చారు.

తరువాత, ఆమె పేరుతోనే రాజు ఆ జువ్విచెట్టుకలప ఉపయోగించి, ఒక గొప్ప దేవాలయం నిర్మించాడు. విక్రమరాజపురంలో ఎనిమిదివందల ఏండ్ల క్రిందట 33 మండపాలతో 33,333 విగ్రహాలతో వెలసిన ఆ గొప్ప దేవాలయం ఇదే!






4

మంత్రి ఆజ్ఞప్రకారం, బంటులందరూ వృద్ధురాలికోసం రాజ్యమంతటా గాలింప జొచ్చారనికదా చెప్పాము! వారాలూ నెలలూ గడిచిపోతున్నై. వెళ్ళినవాళ్ళలో ఒక్కళ్ళూ తిరిగిరావటం కనబడలేదు. వాళ్లకోసమని ఆత్రంతో ఎదురుచూస్తూవున్న మంత్రికి రోజొక యుగంగా తోస్తున్నది.

అయితే—వృద్ధురాలు రానీ, పోనీ, ఆమెనుగురించిన విషయమొక్కటే ముఖ్యం కాదు, మంత్రికి. రాత్రింబవళ్ళు అతని దృష్టిని ఆకర్షిస్తూవున్న విషయాలు ఇంకా అనేకంవున్నై. అవతల పసివాని మరణంలో గల మర్మం యేమిటో కనిపెట్టాలె. ఇవతల రాణి మరణానికిగల కారణాలేమిటో కని పెట్టాలె. ఈవిధంగా తను కోరి భుజ స్కంధాలపైన పెట్టుకొన్న బాధ్యతలు మిక్కుటమైనవీ అపారమైనవిన్నీ.

ఆటువంటప్పుడు మంత్రికి నిద్రపట్టక పోవటంలోనూ, తిండి నోటికి పోకపోవటం లోనూ ఆశ్చర్యమేమున్నది? ఏక్షణాన ఏమివార్త వింటామా అని అతడు చెవులు రిక్కించుకొనివున్నాడు. ఎప్పుడు తనభటులు వస్తారా అని కన్నులు రెప్పవాల్చక చూస్తూ వున్నాడు. ఇక, అతనిబుద్ధి, విశ్రాంతి యెరగక ఎన్నివిధాల యెంత చురుకుగా పనిచేస్తున్నదో నోటిమాటలతో చెప్పటానికి వలనుకాదు.

ఇటువంటి మనోవేదనతో మంత్రి, ఉన్నట్టేవుండి ఒకనాటిరాత్రి ఒంటిపాటుగా వైద్యుడు బంధింపబడిన గదికి వెళ్లాడు.



తలిదండ్రులుగా ఎంచుకొన్నటువంటి దేవప్రియ, కృపాసింహులు మరణించటంతో అస్థాన వైద్యుడు మానసికంగా కృంగిపోయాడు. పైగా ఇప్పుడు, తలవనితలంపుగా తనపై వచ్చిపడిన అపనిందతో ఘరానాగా బ్రతుకుతూవచ్చిన అస్థాన వైద్యుడు కేవలమూ జీవచ్ఛవమే ఐపోయాడు.

ఈస్థితిలోవున్న వైద్యుణ్ణి ఏమని పలకరించటం? మంత్రికి ఏమీ మనస్కరించింది కాదు. నిజానికి-వైద్యుని మనసు ఏమైనా మారిందేమో కనిపెట్టుదామనీ, అయనవల్ల ఏమైనా కొత్తభోగట్టాలు తెలుస్తాయేమో తెలుసుకుందామనీ అనుకొన్నాడు మంత్రి.

కాని, మంత్రి కంటపడటంతోనే వైద్యుడు రాజునూ రాణినీ జ్ఞాపకంచేసుకుని వలవల యేడ్చాడు. అప్పుడు మంత్రి ఆయనను ఊరడించవలసి వచ్చింది. ఇంతటితో వైద్యుడు నిర్దోషి అని మరిఒకసారి మంత్రికి రూఢి ఐపోయింది.

అక్కడినుండి అతడు దాదిని బంధించిన గదికి వెళ్లాడు.

రాత్రివేళ ఒంటిపాటుగావచ్చిన మంత్రిని చూస్తూనే ఆమె బిత్తరపోయింది. ఐనా, అంతలోనే తమాయించుకొని, నిబ్బరపడింది.

"దాదీ! మన రాజవంశం యెంతలో ఎలా ఐపోయిందో చూచావా!" అంటూ సానుభూతిచూపాడు మంత్రి. 'విషపూరితమైన పాలు కళ్లయెదట స్పష్టంగా కనబడుతూవుండగా రాణి మరణం కేవలమూ దైవమాయ అని ఎవరు నమ్ముతారు?' అని, మొదటినించీ తనకుపట్టుకొన్న సంశయం వెలిబుచ్చాడు. ఆమెకూ అస్థానవైద్యుడికీ ఈవిషయంలో వుండే బాధ్యత యెంతటిదో వివరించాడు. వారిద్దరినీ అదుపులో ఉంచవలసివచ్చిన కారణాలు విప్పిచెప్పాడు. 'కృపాసింహుని కుటుంబగౌరవం నిలపడం



మనందరకూ విధి' అంటూ ఆమెకు రాజనీతి బోధించాడు.

చివరకు ఎన్నోవిధాల ఆమెను లాలిస్తూ "దాదీ!—ముక్కూ మొగమెరుగని ఆ వృద్ధురాలికి మనతో సంబంధ మేమున్నది? ఆమె వచ్చి బిడ్డపాలలో విషంకలిపిందంటే న్యాయమూర్తులు నమ్మలేకున్నారు. మీ ఉభయులమీదా అనుమానం బలీయంగా వున్నదనీ, ఒకవేళ ఉరిశిక్షకూడా విధింప బడవచ్చుననీ వదంతులు ప్రబలంగా వున్నాయి. ఈమాట చెప్పటానికే ప్రత్యేకించి పనిగట్టుకువచ్చాను. ఇప్పుడైనా దాపరికంలేకుండా నీకుతెలిసిన నిజం చెప్పితివా, ఉరిశిక్ష తప్పించగల" అని అభయమిచ్చాడు.

ఎంత ఊపిచూచినప్పటికీ దాది రవంతైనా బెసగలేదు. అతడు చెప్పేదంతా చెప్పనిచ్చి, చివరకు ఆమె నిదానంగా 'స్వామీ! నాకు తెలిసినదీ తోచినదీ చెప్పనే చెప్పాను. అప్పుడొకమాటా ఇప్పుడొక మాటా చెప్పేదానినికాను నేను. వృద్ధురాలు రాకుండా ఎక్కడికిపోతుంది? ఏనాటికైనా వచ్చేతీరుతుంది. రానివ్వండి. వస్తేకాని నిజానిజాలు తేలటానికేమీ సావకాశంలేదు. అనుమానిస్తున్నారు కనక ఆమె వచ్చేవరకూ నన్ను ఇక్కడ ఇలా బంధంలోనే ఉండనీయండి. మీకూ నాకూకూడా ఇదే శ్రేయస్కరమైన మార్గం. వృద్ధురాలు వచ్చినతరువాత నా అపరాధం ఋజువైతే ఉరిశిక్షే కాదు, మరే శిక్ష విధించినా సంతోషంతో అనుభవించటానికి సిద్ధంగా వున్నాను' అని చెప్పింది.

దాది చెప్పినమాటలు ఎంతో సబబుగా, నలుగురూ హర్షించేటట్టుగా వున్నాయి. కనుక, మంత్రి మారుచెప్పటానికి అవకాశం ఏమీచిక్కలేదు. అందుకని చక్కా వచ్చేశాడు.




ఆ మరునాడే మంత్రి శక్తిసింహునివద్దకు వెళ్లి—"ప్రభూ! ఒక చిన్న విషయం మనవి చేదామని వచ్చాను. చూడండి—అక్కగారి ఆకస్మిక మరణానికి వృద్ధురాలే కారకురాలై వుంటుందని అందరమూ ఏకీభవించినా, అప్పట్లో అనుమానితులైన వైద్యుడినీ, దాదినీ నిజం వెల్లడి అయే వరకు బంధంలో వుంచటం అవసరమని అలాచేశాము. ఇప్పటికి ఆరేండ్లు గడిచినై. ఆ వృద్ధురాలు వచ్చే జాడ కనుపించలేదు. ఆఖరుప్రయత్నంగా నేను గతరాత్రి దాదినీ, వైద్యుడినీ కలుసుకున్నాను. నిజం వెల్లడించని పక్షంలో ఉరిశిక్ష విధించబోతారనికూడా బెదిరించిచూచాను. అయినప్పటికీ ఏమీ ప్రయోజనం లేకపోయింది. అంతేకాదు. వాళ్లిద్దరూ నిర్దోషులని నాకు పూర్తిగా నమ్మకం చిక్కింది. అందుచేత ఆ నిరపరాధులను యింకా బంధంలో వుంచటం న్యాయంగా తోచటంలేదు. ఈవిషయంలో దేవర అభిప్రాయం..." అని యింకా ఏమో చెప్పబోయాడు.

శక్తిసింహుడు అడ్డుతగిలి: "మంత్రీ! నేనూ ఇందునుగురించే ఆలోచిస్తున్నాను. ఇంతలో నీవూవచ్చావు. తరతరాలుగా మన ఆస్థానం కనిపెట్టుకొనిఉన్నవాడు వైద్యుడు. పాపం అమాయకుడు. ఆయనవల్ల ద్రోహం జరిగివుంటుందని నేననుకోను. పోతే, దాది—నా మేనల్లుణ్ణి కడుపులో పెట్టుకుపెంచింది. ఆమెనుమాత్రం ఎలా అనుమానించటం? కనుక నీ సలహాప్రకారం వాళ్లిద్దరినీ యిప్పుడే విడుదలచేయిద్దాం" అన్నాడు.

ఈ ఆజ్ఞతీసుకుని మంత్రి సరాసరి దాదీ, వైద్యుడూ వున్నచోటికి వెళ్ళాడు. వాళ్లిద్దరినీ విడుదలచేయించివేశాడు.

దాది యెక్కడ నిజం బయటపెట్టుతుందో, ఏమికొంప మునుగుతుందో అని

యింతకాలంగా లోలోపల హడిలిపోతున్న శక్తిసింహుడు, అదృష్టవశాత్తు యిలా కలిసివచ్చేసరికి ఉప్పొంగిపోయాడు. ఇక బ్రహ్మ రుద్రాదులు కూడా తనుచేసిన మోసం గ్రహించలేరుకదా అని యెంతో స్తిమితపడ్డాడు. అయితే, కపటమైన ఈ మనస్తిమితం ఎంతకాలం నిలుస్తుంది?

సంసారంలో అతనికి అంతులేని కష్టాలు దాపరించె. వాటిని నివారించుకునేటందుకు అతడు పడ్డపాట్లు బ్రహ్మకే తెలియాలె. ఒక్కొక్క కష్టమే ఒంటపట్టటంతో అతనికి గుండెనిబ్బరం సడలిపోసాగింది. గండాలు గడిచి కష్టాలు గట్టెక్కటానికని ఎవరేమి చెబితే దానినల్లా తల ఒగ్గి చేస్తూవచ్చాడు.

కష్టాలకు లొంగిపోయిన ప్రాణి ఇలా చేయటంలో అబ్బురమేమున్నది! దేవుడూ లేడు దయ్యమూలేదు అని మొరాయించి తిరిగే శక్తిసింహుని మనస్తత్వం ఇప్పుడు అతిచిత్రంగా మారిపోయింది. కాస్త గెడ్డం పెంచుకుని కాషాయగుడ్డ కట్టి కమండలువు చేతపట్టినవాడు కనిపిస్తే చాలు, వాడిని ఆశ్రయించి తరణోపాయం సెలవీయమంటూ అదొక విధమైన పిచ్చి ధోరణిలో ప్రాధేయపడుతూ వచ్చాడు. ఏ




పుట్టలో ఏపామున్నదో, ఏ మహాత్మునిలో ఏమిమహిమ వున్నదో అనే గుడ్డినమ్మకతో అతడు తోవనుపోయే సాధువుల నందరినీ పిలిచి, వారివల్ల జ్ఞానబోధలు వింటూఉండేవాడు. తన పుణ్యంకొద్దీ ఏ మహానుభావుడైనా వస్తాడా, మనశ్శాంతి కలిగిస్తాడా అని అనుక్షణమూ అలా నిరీక్షిస్తూనే ఉన్నాడు.

ఇలా తపించిపోతూవున్న శక్తిసింహుడి భవనానికి ఒకనాటి ఉదయం ఒకానొక యోగిపుంగవుడు విచ్చేశాడు. కాపలావాళ్లనైనా లెక్కపెట్టకుండా చరచరమంటూ భవనంలోకిపోబోయాడు. ఐతే కాపలావాళ్లు అడ్డుకున్నారు. కాని, అంతలోనే అదృష్ట



వశాత్తు శక్తిసింహుడు ఆ చాయలకు రాపటం తటస్థించి, అతడే స్వయంగా ఆ యోగిపుంగవుని తనతోకూడా భవనంలోనికి తీసుకుపోయాడు. ఈ యోగీశ్వరుని వేషభాషలు అసామాన్యంగా కన్పట్టినై. చూడగా, ఇంతవరకు వచ్చిన యోగీశ్వరులందరూ ఒకయెత్తు, ఇప్పుడు దర్శనమిచ్చిన ఈ మహానుభావుడు ఒక్కడూ ఒక యెత్తు అనిపించింది శక్తిసింహుడికి.

ఏమంటే, ఇంతవరకు వచ్చిపోయిన సాధువులందరూ తన జీవితవిశేషాలలో ఒక్కటైనా తప్పిపోకుండా చెప్పలేకపోయారు. కాని, ఇప్పుడీ మహానుభావుడు ఎంతటివాడో కాని, పలికిన పలుకులన్నీ ఆణిముత్యాలే! మచ్చునకైనా ఒక్క వాతప్పు కనిపించలేదు.

శక్తిసింహుడి చరిత్ర అంతా పుస్తకంలో పత్రాలు తిరగవేసినట్టు గబగబా చెప్పుకొనిపోయాడు యోగిపుంగవుడు. తన్మయుడైపోయాడు శక్తిసింహుడు. అతడి మనసులోని వాంఛలన్నీ ఏకరుపెట్టాడు యతీశ్వరుడు. కుటుంబంలో కలిగిన కష్టాలన్నిటినీ పూసగుచ్చినట్టు వెల్లడించాడు. తన జీవితంలోని ఒక్కొక్క హంశమే చెబుతూవుంటే శక్తిసింహుడి శరీరం కంపించిపోయింది. ఇంతకాలంగా బ్రహ్మకుకూడా తెలియనీయకుండా దాచిపెట్టుకొనగలిగానని అనుకొన్న శక్తిసింహుడు, తన గుట్టుమట్టుల్ని యతీశ్వరుడు వెలిబుచ్చుటంతో నిస్తబ్ధుడైపోయాడు.

ఈ యతీశ్వరుడు తన తపఃఫలంకొద్దీ ప్రత్యక్షమైన దైవంలాగా కనిపించాడు. ఈ మహానుభావుని నోటివెంట వచ్చే ఒకొక్క మాట ఒకొక్క మంత్రంలాగా వీనుల విందుగా వినిపించింది.

మరి, దేవునియెడట దాపరికమేమిటి? "మహాత్మా!—నేనుచేయని పాపములేదు.



రాజ్యకాంక్షతో నా బావమరిది కుటుంబమే నామరూపాలులేకుండా నాశనంచేసిన మహా పాపిని నేను!! నేను చేసుకొన్న మహా పాతకాలే నన్ను చుట్టుకుని, ఈ జన్మలో నే కట్టికుడుపుతున్నాయి" అంటూ సమస్త విషయాలూ మాయా మర్మం లేకుండా ఆయనతో చెప్పివేశాడు.

"మహాత్ములకు అసాధ్య మేదీలేదు. నాకు తరణోపాయం అనుగ్రహించండి. స్వామీ మనశ్శాంతి ప్రసాదించండి!"అంటూ శక్తిసింహుడు యతీశ్వరునికి పాదాక్రాంతుడై, పూర్తిగా ఆయనకు వశుడైపోయాడు.

తన దుష్టచింతలకు, దుర్నయాలకు సిగ్గుపడి తలవంచుకొన్న శక్తిసింహుణ్ణి– పశ్చాత్తాపంతో కన్నీటిధారలు రాల్చే శక్తిసింహుణ్ణి–కనికరించినట్టుగా ఒక్క దయారసమొలికే చూపు చూచాడు యతీశ్వరుడు. కొంచెంసేపు ఆలోచనలో మగ్నుడయ్యాడు. తరువాత పాపపరిహారార్థం ఆచరించవలిసిన కొన్ని కొన్ని ప్రక్రియలు సూచించాడు. ఇలాచేస్తే మేలు కలుగుతుందని చెప్పి దీవించాడు.

ఆరోజుకు ఉండిపొమ్మని శక్తిసింహుడు యెంతగానో బ్రతిమలాడాడు. కాని, యతీశ్వరుడు 'మరొకప్పుడు మళ్లీ దర్శనమిస్తాము. లోకహితంకోసం సంచారం చేయవలసిన విధి మాది. ఒక్కచోటనే ఇంతకాలం వుండటం పాడికాదు' అని చెప్పి, గెడ్డం సవరించుకొంటూ వేగిరపాటుతో లేచాడు. సంపూర్ణమైన భక్తివినయాలతో శక్తిసింహుడు ఆ మహానుభావుణ్ణి కోటద్వారంవరకు స్వయంగా సాగనంపి ఆయనవద్ద సెలవుతీసుకొన్నాడు.

తొందరగా పోతూవున్న యతీశ్వరునికి టకీమని గుమ్మం తగిలింది. తడబడ్డాడు. ఆ తడబాటులో ఆయన మొలనున్న బాకు కింద పడింది. అది పడిపోవటం గ్రహించా

డాయన. అయితే, ఒక్క క్షణమైనా జాగు చేయక ఆయన వెనుతిరిగిచూడకుండా అక్కడనుండి చరచర తనదారిని తను వెళ్ళిపోయాడు.

కిందపడిన బాకు కంటబడగానే ఫారా వాళ్ళలో ఒకడు కంపించిపోతూ కంగారుగా పోయి, దానిని శక్తిసింహునిముందు ఉంచాడు. మరొక ఫారావాడు ఆ యతీశ్వరుని వెంటబడ్డాడు.

యతీశ్వరుని కరుణవల్ల ఇక మంచి రోజులు వస్తాయికదా అని సంతోషపడుతున్న శక్తిసింహునికి బాకు కంటపడగానే మతిచలించింది. బాకు అటు యిటు తిప్పి చూచాడు. దానిమీద పేరు చూడటంతో అతని హృదయంలో అగ్నిపర్వతం పగిలినట్టయింది!! వెర్రిగా కేకలు ప్రారంభించాడు: "దొంగ - దొంగ - గజదొంగ - పట్టండి - పోండి - పట్టుకోండి-సాధువును పట్టితేండి - పోండి" అంటూ రంకెలువేస్తూ, కూర్చున్న చోటనే సోలిపోయాడు.

రాజాజ్ఞను శిరసావహించి ఆస్థానపు అశ్వికులు పంచకళ్యాణిలవంటి గుర్రాల మీద దౌడుతీసుకొంటూ పోయి సాధువును పట్టబోయారు. అన్నీ సిద్ధపరుచుకుని వచ్చినవాడు సాధువు. కనుక బాకు జారిపోవటంతోనే అంచీలమీద ఎగిరిపోయాడు!! ఐనా, శక్తిసింహుని అశ్వికులు తోడావేసికొన్న వాళ్ళు. ఎట్లా ఐనా సాధువును పట్టాలెననే పట్టుదలతో చాకచక్యమంతా వినియోగించి శక్తికొద్దీ పరుగుతీశారు. అల్లంతదూరంలో ఆ సాధువుగుర్రం రేపే ధూళి కనిపించింది. ఎలాఐనా ఆ గుర్రాన్ని కలుసుకోవాలనే గట్టి దీక్షతో వాళ్లు వాయువేగంతో సాగిపోయారు.

ఈ విధంగా సాధువు ముందూ, అశ్వికులు వెనకా, ఒకరినిమించి ఒకళ్ళు దౌడుతీయసాగారు. —(ఇంకా వుంది)



# సంతోష వార్త

కమలాపురంలో రంగధామారావనే డాక్టరొకాయన కొత్తగా ప్రాక్టీసు మొదలుపెట్టేడు. నల్లబల్లమీద తెల్లటి అక్షరాలలో తనపేరూ, ఆ పేరుతర్వాత తన డిగ్రీలూ వ్రాయించి, ఆ బల్లను గేటుకు వ్రేలాడగట్టించాడు. వచ్చిపోయేవాళ్లందరూ దాన్ని చూస్తోనే ఉన్నారుగాని ఎవరూ వైద్యం కోసం వచ్చినపాపాన పోలేదు.

"మనం బల్లకట్టినవేళ అట్టే మంచిది గానట్టుంది. ఇంక ఇక్కడనుంచి మకాం ఎత్తేసి మరో ఊరుకు పోతే బాగుండేట్టుంది" అని అతడు ఒకనాడు ఆలోచిస్తూండగా, ఒక ఇల్లాలు గేటుతలుపు తీసుకుని ఆదుర్దాగా లోపల ప్రవేశించింది.

ఆవిణ్ణి చూడటంతోనే డాక్టరు మొహం చేటంత ఐ, అతడు ఆమెను ఆదరించి కూర్చోమని, "ఏమండీ, ఏంజబ్బూ?" అని అడిగాడు.

ఆ ఇల్లాలు, "బాబూ, నాకు కాదండి. మావారికి పదిరోజుల్నుంచీ జబ్బుగా ఉండి, ఇవాళ ఉన్నట్టుండి మైకం కమ్మేసింది. తమరొక్కమారు మా యింటికి వచ్చి, నా పసుపూ, కుంకం నిలపాలి!" అంది.

డాక్టరు, "దానికేం? అందుకేగా మేం బల్ల కట్టుకున్నది! పదండి" అంటూ, వాళ్ళింటికి వెళ్ళేడు.

ఆవిడ పేరు కాంతమ్మ. భర్త పేరు శంకరం. డాక్టరుగారు శంకరాన్ని పరీక్ష చేసి, "ఏం ఫరవాలేదు. గుండె కొంచెం నీరసంగా కొట్టుకుంటోంది. కొత్తరకం ఇంజక్షను వచ్చింది. ఆ ఇంజక్షనిస్తే, వెంటనే సులువు కనిపిస్తుంది" అంటూ, ఒక చీటీమీద ఆ మందుపేరు రాసిఇచ్చి, "దీన్ని వెంటనే తెప్పించండి" అన్నాడు.

కాంతమ్మ, "బాబూ, నావద్ద ఒక్క చిల్లిగవ్వకూడా లేదు. వారికి నయమవటం

టి. సుందరలక్ష్మి - జయపురం




తోనే ఇచ్చుకుంటాము. ఆ మందేదో తమరే కొనిపెట్టాలి!" అని ప్రాధేయపడింది.

"బోడిబేరం అనుకుని సంతోషిస్తే, చేతిసొమ్ము పడుతోందేమిటి?" అనుకుని డాక్టరు, "మందుకూడా నన్ను కొనమంటే ఎలాగండీ?" అనబోయాడు. కాని "పోనీ కాస్త పెట్టుబడి పెడదాం. మందు ఖరీదూ, ఫీజూకూడా ఇచ్చేస్తారు తర్వాత. ఇవ్వక పోతే, 'డాక్టరుగారు కుదిర్చేరు' అని పది మందితోటీ ప్రచారమైనా చేస్తారు. దానితో నాప్రాక్టీసు బాగుపడి ఇక్కడే స్థిరపడవచ్చు" అనే ఆలోచనతోచి, తనవద్దనున్న రెండు రూపాయలూ తీసి ఆమెకిచ్చాడు.

ఆ ఇంజక్షనుతో శంకరానికి తెలివి వచ్చింది. క్రమంగా అతగాడి రోగం మలుపుతిరిగి సులువుగా కనపడింది. డాక్టరు కాంతమ్మగారితో, "అమ్మా, ఇంక మీ ఆయన కేమీ భయంలేదు. ఆయనది గుండెజబ్బు గనక మీరుమాత్రం ఆయనకి ఒక దుఃఖవార్తగాని, సుఖవార్తగాని అతాత్తుగా చెవిని పడెయ్యకూడదు. ఏమంటే ఈ రకం రోగులకి అతాత్తుగా ఏం తెలిసినా ప్రమాదిస్తుంది" అని హెచ్చరించాడు.

"అలాగే బాబూ, ఈ విషయంలో చాలా జాగ్రత్తగానే ఉంటాను" అంది కాంతమ్మ.

ఒక్కవారం గడిచింది. కాంతమ్మగారు చేతిలో ఒక టెలిగ్రాం పుచ్చుకుని డాక్టరింటికి పరుగెత్తివచ్చింది. "బాబూ, ఈ తంతిలో వచ్చిన సంతోషవార్త మావారి కింకా నేను చెప్పలేదు. ఎలాగ చెప్పడమా అని తమసలహా తీసుకోటానికి వచ్చాను" అని ఆవిడ ఆ కాగితాన్ని రంగధామారావు చేతిలో పడేసింది.

అతడు తంతిని చదివి, "ఏమిటి? మీవారికి లాటరీలో యాభై వేల రూపాయలు వచ్చాయని ఉంది! ఏమి అదృష్టమండీ మీది!" అని అభినందించాడు. అయితే



ఆవెంటనే అతని మనస్సులో కొంచెం అసూయ బయల్దేరి, "ఒక్కొక్కళ్లకి ఇలాగే ఉత్తినే డబ్బొచ్చిపడుతోంటుంది. నాలాంటి దౌర్భాగ్యులికి ఎంత శ్రమపడ్డా భత్యాలు కూడా కిట్టవు!" అనిపించింది.

కాంతమ్మగారు తన హడావిడిలో డాక్టరేమనుకుంటూన్నదీ యోచించకుండానే, "బాబూ, ఈ సంతోష వార్తను మావారి చెవిని ఎలాగ పడెయ్యాలో నాకు తెలియకుండాఉంది. చెప్పకుండా ఊందామంటె ఉండబట్టలేక పోతున్నాను" అంది.

డాక్టరు, "నేను మధ్యాహ్నం వచ్చి మీవారితో మాటామంతి మొదలెట్టి, మెల్లిగా తెలియపరుస్తానులెండి. అప్పటివరకూ మీరుకాస్త ఉగ్గబట్టుకోండి" అన్నాడు.

ఆమె "అలాగే కానివ్వండిబాబూ" అని చెప్పి వెళ్ళిపోయింది.

"ఏం అదృష్టం ఇతగాడిది! జబ్బులో మందులు కొనటానిక్కూడా టికాణాలేని వాడు, అరలక్షకి అధికారిఐ కూచున్నాడు! పోయేప్రాణానికి అడ్డుపడ్డాను గనక ఎన్ని వందలైనా ఇవ్వొచ్చు. ఐదువందలదాకా అడిగిచూస్తాను!" అనుకుంటూ రంగధామారావు శంకరం ఇల్లు చేరుకున్నాడు.

డాక్టరు ఎంతో ఆప్యాయంగా ప్రసంగం మొదలెట్టేసరికి శంకరం, "డాక్టరుగారూ, మీవంటి మంచివాళ్లు కోటికి ఒక్కరు కూడా వుండరు. ఈరోజుల్లో డాక్టర్లన్నవాళ్లు పైసా చేతిలో పడితేతప్ప మాట్లాడరే. అలాంటిది మీరు మందులు దగ్గిరనుంచీ కొని ఇచ్చి, రోజూ చూసి వెడుతున్నారు. మీఋణం ఎలా తీర్చుకోగలనో" అన్నాడు.

డాక్టరు తెలివిగా, "శంకరంగారూ, కష్టాలేం కాపురముంటాయా? మీకూ మంచిరోజులు వస్తాయి" అన్నాడు.

"ఎలా వస్తాయి బాబూ?" అన్నాడు శంకరం నిస్పృహతో.

"ఎలాగేమిటి? ప్రాప్తంవున్నవాళ్లకి ఎలాగేనా వస్తుంది. మాటకి, లాటరీలో యెంత మందికి రాలేదు?" అన్నాడు డాక్టరు.

"లాటరీలోనా? ఆ అదృష్టవంతులు వేరుబాబూ! 'పెద్దు మెుర్రో' అంటూంటే వినక మా మేనేజరుగారు నాచేతకూడా ఒక లాటరీ టిక్కట్టు కొనిపించి, జీతంలో రూపాయి విరగ్గోసుకున్నాడు! ఆ రూపాయైనావుంటే ఏఖర్చుకైనా వచ్చేది" అని విచారం వలపోసుకున్నాడు శంకరం.

"అలా అనుకోకూడదు. బోడిరూపాయి ఒకటిపోతే పోయెగాని అమాంతంగా ఏ యాభైవేలో వచ్చిపడొచ్చు. అప్పుడు ఫీజుకని ఒక రెండొందలూ, బహుమతీకింద ఒక మూడువందలూ మొత్తం ఒక ఐదువందలు నాకు ఇవ్వచ్చుకూడా!" అన్నాడు డాక్టరు.

శంకరం, "నాకు నిజంగా యాభైవేల రూపాయలే వచ్చిపడితే మీకు ఉత్తి చచ్చు ఐదువందలుకాదు, పాతికవేలు యిచ్చుకుంటాను! ఎగతాళి అనుకొనేరు. ప్రమాణం చేసి చెపుతున్నాను" అన్నాడు.

ఐదువందలతో తృప్తిపడదలచిన డాక్టరుకి, "పాతికవేలు!" అని చెవినిపడటంతోనే అకస్మాత్తుగా పట్టరానిసంతోషం కలిగింది. "పాతికవేలే! ఆ! ఆ!" అంటూ ఆవలించి ప్రాణంవదిలేశాడు!

కూర్చున్న మనిషల్లా కుర్చీలోంచి క్రిందకు ఒరిగి పడిపోతోంటే చూస్తూన్న శంకరం బిత్తరపోయాడు. కాంతమ్మ గొల్లుమంది. ఆవిడ గొల్లుమనడం విని ఇరుగు పొరుగులు చేరారు.

కాంతమ్మ లాటరీసంగతిచెప్పి, "మా వారికి ఈ సంతోషవార్త మెల్లిగా చెప్పాలని డాక్టరుగారొచ్చి ఇలా ఐపోయారు!" అంది.

శంకరం, "నాకు తప్పించాలన్న ముప్పులో తనే పడ్డాడు పాపం!" అని నిట్టూర్చాడు.





# మూడు ప్రశ్నలు

చాలా కాలం క్రిందట భువనగిరి అనే రాజ్యాన్ని బాహుబలుడు అనే రాజు పాలిస్తూండేవాడు. అతను పుట్టుకతోనే వంచకుడు, క్రూరుడున్నూ. తన పెద్ద సైనికబలాన్ని యెంతసేపూ యితరులను వంచించేందుకూ, పరరాజ్యాలను అక్రమంగా ఆక్రమించేందుకూ వినియోగించేవాడు.

బాహుబలుడు పాలించేది కొద్దిపాటి భూభాగమేఐనా, కవులచేతా పండితులచేతా అనేకవిధాలుగా స్తోత్రాలుచేయించుకోవడం అతడికి సరదాగా వుండేది.

ఆ కాలంలో ఒక్క భువనగిరి రాజ్యంలోనేగాక, దేశదేశాలలో గొప్ప పండితుడుగా కీర్తిపొందినవాడు ధర్మబలుడు. ఆయన ధనకనక వస్తువాహనాలనూ, గోభూదానాలనూ ఆశించే స్వార్థపరుడు కాడు. అందుచేత, ప్రతిఫలాపేక్ష లేకుండానే శిష్యులకు విద్యాబోధచేస్తూ, యెన్నడూ రాజును ఆశ్రయించకుండా బీదతనంతోనే జీవితాన్ని గడుపుతూవున్నాడు.

బాహుబలుడు, ధర్మబలుడి కీర్తిప్రతిష్ఠల గురించి విన్నాడు. ప్రజాసామాన్యానికి అతడంటేవున్న భక్తిచూసి, రాజుకు ఎక్కడలేని యీర్ష్య కలిగింది. ఎలాఐనాసరే, ధర్మబలుడిని సాధించి లొంగతీసుకుని పాదాక్రాంతుణ్ణి చేసుకోవాలనుకున్నాడు.

ఒకనాడు నిండుకొలువులో అతణ్ణి దర్బారుకు పిలిపించి, "నిన్నుగురించి చాలా ప్రమాదకరవార్తలు వింటున్నామే!" అన్నాడు బాహుబలుడు.

ఆ మాటలకు ధర్మబలుడు నివ్వెరపోయాడు. రాజు కపటీ, క్రూరుడూ అని అతడికి తెలుసు. "నన్నుగురించా! ఏలినవారి రాజ్యంలో శాంతంగా బ్రతికే పౌరుణ్ణి నేను!" అన్నాడు ధర్మబలుడు వినయంగా.

డి. సుబ్రహ్మణ్యం, తెనాలి



బాహుబలుడు ఆ జవాబు విని ఉగ్రుడయ్యాడు. అతడి ముఖంలో క్రోధం తాండవించింది. "నీ ఎత్తులూ, జిత్తులూ, కపటమూ, వినయమూ నాదగ్గర సాగవు. విద్యాబోధ అంటూ నీవు రాజద్రోహం బోధిస్తూన్నట్టు మాకు తెలియవచ్చింది. జాగ్రత్త!" అన్నాడు.

రాజు క్రోధంగా అడిగిన పలుకులకు ధర్మబలుడు కళవెళపడ్డాడు. ఏ నేరం చేయని తనపై రాజుకు యింత ఆగ్రహం ఎలా కలిగిందో తెలియక, "ప్రభూ! రాజద్రోహకార్యాలతో నాకేప్రమేయం లేదు. నాకు తెలిసిన శాస్త్రవిషయాలు విద్యార్థులకు బోధిస్తూ శాంతంగా కాలం వెళ్ళబుచ్చుతున్నాను" అని జవాబుచెప్పాడు ధర్మబలుడు సవినయంగా.

బాహుబలుడి కోపం ఇంకా ఎక్కువైంది. కావాలని తెచ్చుకున్న కోపం, ఎంత కావలిస్తే అంత పరిమాణంలోనూ పెరుగుతుందికదా!

"నీకు శాస్త్రవిషయాల్లోనే అంత జ్ఞానం వుండి, రాజద్రోహానికి దూరంగా వుండేవాడివే అయితే, నేను మూడు ప్రశ్నలు అడుగుతాను. వాటికి జవాబుచెప్పు!" అన్నాడు బాహుబలుడు.

"సరే! ప్రభూ!" అన్నాడు ధర్మబలుడు తల వాల్చి.

రాజు కోరమీసంకొసల్ని పురివేసి, "నా మూడు ప్రశ్నలకూ సరైనజవాబు యివ్వకపోయావంటే నీతల నరికించి కోటకొమ్ముకు కట్టిస్తాను. ఇక, ప్రశ్నలేవో జాగ్రత్తగా విను. ఒకటి: నేను యీ తలమీది కిరీటంతో ఎంత విలువ చేస్తాను? దమ్మిడీలతోసహా లెక్క చెప్పాలి! రెండు: నేను, యీ ప్రపంచాన్ని ఓమారు చుట్టిరావాలంటే, ఎంతకాలం పడుతుంది? నిమిషాలతో సహా చెప్పాలి! మూడు: నువ్వీ ప్రశ్న




లకు జవాబులిస్తూండగా, నా మనస్సులో ఏమి ఆలోచిస్తూవుంటాను ? బిడ్డలకుకూడా తెలిసేటట్టు స్పష్టంగా తెలియజెప్పాలి!" అన్నాడు.

ఈ ప్రశ్నలకు జవాబులివ్వడం మానవులకు సాధ్యం కాదని ధర్మబలుడికి తోచింది. అయినా ప్రయత్నిద్దామనుకుని ఓ వారంరోజులు గడువుకోరాడు. బాహుబలుడు అనుమతించాడు.

ధర్మబలుడు తిరిగి తనగ్రామం చేరుకొన్నాడు. మూడు ప్రశ్నలకూ జవాబుల కోసం అనేక శాస్త్రగ్రంధాలు గాలించాడు. తక్కిన పండితులను అడిగిచూశాడు. ఎవరూ చెప్పలేకపోయారు.

గడువునాటికి ధర్మబలుడు తిరిగి రాజదర్బారుకు బయలుదేరాడు. కన్నీళ్లతో శిష్యులంతా వీడ్కొలిచ్చారు. గ్రామం దాటి కొద్దిదూరం వెళ్లగానే ఒక గొర్రెలకాపరి ఎదురై ఆయనకు నమస్కరించి, విచార కారణం అడిగాడు.

ధర్మబలుడు సంగతిసందర్భాలన్నీ వివరించాడు. అంతా విని గొర్రెలకాపరి పెద్దగా నవ్వి "ఈ మూడు ప్రశ్నలకూ నేను జవాబులివ్వగలను. ఐతే, మీదుస్తులు నాకివ్వండి. తక్కిన పని నామీద వదిలేయండి" అన్నాడు.

మొదట ఆయన అంగీకరించలేదు. గొర్రెలకాపరి కాళ్ళావేళ్ళా పడి ఎంతో బ్రతిమాలుకోగా ధర్మబలుడు వప్పుకొన్నాడు. గొర్రెలకాపరికీ ధర్మబలునికీ పోలికలలో అట్టే తేడాలేనందునా, ధర్మబలుడు యింతవరకూ ఒక్కసారిమాత్రమే రాజసముఖానికి వెళ్లివున్నందునా, ఆ మార్పు తృప్తికరంగానే వుంది.

ధర్మబలుడి వేషంలోవున్న గొర్రెలకాపరి దర్బారుకు వెళ్లగానే, బాహుబలుడు చిరునవ్వునవ్వి జవాబులు చెప్పమన్నాడు.

గొర్రెల కాపరి గొంతు సవరించుకుని, "మహాప్రభూ! తమ మొదటి ప్రశ్నకు జవాబు చిత్తగించండి: తమ విలువ తొంబదితొమ్మిది రూకలు. ఎలా అంటే నక్షత్రకుడు సత్యహరిశ్చంద్రుణ్ణి నూరు రూకలకేకదా అమ్మింది! సత్యహరిశ్చంద్రునికన్న తమవిలువ ఒక్కరూకమాత్రమే తక్కువ!" అన్నాడు.

బాహుబలుడు పట్టరాని సంతోషంతో ఉప్పొంగిపోయాడు. సత్యహరిశ్చంద్రుడితో తనను పోల్చటం ఎంతో తృప్తికలిగించింది. రెండవ ప్రశ్నకు జవాబుచెప్పమన్నాడు.

"ప్రభువువారు సూర్యోదయంతోనే లేచి ప్రపంచం చుట్టిరావడానికి బయలుదేరితే, సూర్యాస్తమయమై, తిరిగి మరునాడు సూర్యోదయం అయేసరికి ఇరవైనాలుగు గంటలవుతుంది" అన్నాడు గొర్రెలకాపరి.

"భేష్! వహ్వా! వహ్వా!" అన్నారు దర్బారంతా.

"అయితే మూడవ ప్రశ్న?" అన్నాడు బాహుబలుడు కనుబొమలు ముడిచి.

"చిత్తగించండి ప్రభూ: తమ మూడవ ప్రశ్నకు నా జవాబు మరేమంత కష్టమైంది కాదు. ఈ జవాబులిచ్చే నేను ధర్మబలుడినని తమరు మనస్సులో అనుకుంటూ వున్నారు. కాని నేను ధర్మబలుడిని కాదు. గొర్రెలకాపరిని!" అంటూ మీద కప్పుకొన్న పండితశాలువా, చెవికిపెట్టుకొన్న కుండలాలూ తీసి అవతల పడవేశాడు, గొర్రెల కాపరి.

దర్బారంతా నివ్వెరపోయింది. బాహుబలుడు నిర్ఘాంతపోయాడు. ఎంతో తెలివిగా చెప్పిన ఆ జవాబులకు అందరూ ఎంతగానో సంతోషించారు.

ఇటువంటి అగ్నిపరీక్షకు నిలబడిన ధర్మబలుడినీ, గొర్రెలకాపరినీ ఇష్టమున్నా లేకున్నా సత్కరించక తప్పిందికాదు రాజైన బాహుబలుడు.






పారశీకదేశాన్ని పూర్వం ఒకప్పుడు ఫజుల్ మహమ్మదు అనే ఒక గొప్ప చక్రవర్తి పరిపాలించాడు. ఆయన తాను నివసించే రాచనగరును ఎన్నో లక్షల మొహిరీలు ఖర్చుచేసి కట్టించాడు. దేశదేశాలనుంచి పనివాళ్లను రప్పించి వాళ్లనేర్పంతా ఆ భవన నిర్మాణంలో కనపరచవలసిందనీ, గొప్ప బహుమతీలు ఇస్తాననీ వాగ్దానంచేసి పని చేయించాడు.

చలువరాళ్ళు, రత్నాలు, మణులు, పచ్చలు, గోమేధికాలు, పుష్యరాగాలు, కెంపులు, వజ్రాలు—అవేమిటి, ఇవేమిటి-విలువైనరాళ్లన్నీ, విశాల ప్రపంచంలో ఎక్కడెక్కడున్నవీ, అడిగినంత వెలా ఇచ్చి కొనేసి రప్పించి, ఆ నగరు గోడలకీ, నేలకీ, సరంబీకి తాపళంచేయమన్నాడు.

విత్తంకొద్దీ వైభవం అన్నట్లు ఆ రాజ భవన మెంతో రమణీయంగా తయారై, విదేశాలనుంచికూడా ఎంతోమంది జనం వచ్చిచూచి మెచ్చిపోతూండేవారు. వాళ్ళు మెచ్చుకుపోతూంటే చక్రవర్తి విని, తాను చేసిన ఘనకార్యానికి ఉబ్బి తబ్బిబ్బై, ఇంకా ఆ భవనానికి వన్నెలూ చిన్నెలూ తీర్చి దిద్దటానికి సొమ్ము వెచ్చిస్తోనే ఉండేవాడు.

తన తాతలు గడించి పోగుచేసివుంచిన ధనం కోట్లకొలది ధనాగారంలో ఉండేది గనక, ఆ సొమ్మంతా వెచ్చించి ఆ గొప్ప భవనాన్ని ఆయన కట్టగలిగేడుగాని యే చక్రవర్తి అలాంటి భవనం కట్టించటానికి సాధ్యమవుతుంది?

ఆ భవనంలో ఆయన నివసిస్తో ఒక ఇరవై సంవత్సరాలు దేశాన్ని పరిపాలించి, మరణించాడు. ఆయన చనిపోతూ తన అనంతరం గద్దెనెక్కవలసిన యువరాజు సిరాజ్‌ను పిలిచి, 'నాయనా, ఈ రాజ

జె. శోభనాద్రి - నర్సీపట్నం




భవనం ఎంత ప్రాభప్రదంగా చూచుకొం టున్నానో, దానికి ఎన్నివిధాలుగా అంద చందాలు అమర్చానో నీకు తెలుసుకదా! కనుక, ఈ భవనాన్ని నీ శక్తికొద్ది నీవూ అభివృద్ధిచేసి, నా అభిలాష తీర్చవలిసింది!' అని చెప్పిపోయాడు.

చక్రవర్తికావటంతోనే సిరాజ్‌కి తండ్రి కన్నా ఎక్కువపేరు సంపాదించాలని తోచింది. తండ్రి కట్టించిపోయిన రాచనగరు చుట్టూ, ఉద్యానవనాలు, సరోవరాలు, లతామండపాలు, చిత్రవిచిత్రమైనవేవేవో, అయన కట్టించాడు. వాటన్నింటికీ బోలె డంతసొమ్ము ఖర్చయింది.



తండ్రి కాలంలోనే ధనాగారంలోని సొమ్ము యావత్తూ ఖర్చైపోయింది. కనక, సిరాజ్ తను పురమాయించిన కట్టడాలకు కావలసిన సొమ్మంతా ప్రజల నుండి పన్నులద్వారా రాబట్టేడు. ప్రజల నుండి రాబట్టిన సొమ్ము ప్రజలమీదే ఖర్చు చెయ్యాలిగాని, ఇలా రాళ్ళకీ రప్పలకీ ఉద్యానవనాలకీ రాచనగరుకీ ఖర్చు చెయ్యటమేమిటని ప్రజలలో సణుగులు బయల్దేరేయి. కాని ఎవళ్ళూ యెదటబడి సిరాజ్‌ను కాదనలేకపోయారు.

సిరాజు ఆ భవనంలో నివసిస్తూ ఉద్యాన వనాలలో విహరిస్తూ ప్రజలయొక్క కష్టాలు గమనించకుండా వాళ్ల సొమ్మంతా ఆ భవనంమీదా, తాను చేయించిన నిర్మాణాల మీదా వెచ్చిస్తో ఒక పాతికేళ్ళు పాలించి చనిపోయాడు.

పోతూ, కుమారుడైన అబ్దుల్లాను పిలిచి, 'నాయనా, పారశీక చక్రవర్తుల ఖ్యాతిని దశదిశలా వ్యాపింపజేస్తోన్న మన రాచ నగరునీ, ఈ ఉద్యానవనాలనీ, లతామండ పాలనూ, సరోవరాలనూ జాగ్రత్తగా చూసు కోవాలిసుమా. ఇంతవరకు మేముచేసి వద లిన పనులను అభివృద్ధిచేసి మెరుగులు

పెట్టాలిసుమా!' అని హెచ్చరించి కన్ను మూశాడు.

గద్దెనెక్కటంతోనే అబ్దుల్లాకు తండ్రి తాతలకన్నా ఎక్కువకీర్తి సంపాదించాలని తోచింది. తాత కట్టించిన భవనంలోనూ, తండ్రి కట్టించిన మండపాలలోనూ ఏవేవో లోపాలు కనిపించి, వాటిలో కొన్నిభాగాలను పడగొట్టించి మళ్ళీ కట్టించటం ప్రారంభించాడు. ఇందుకోసమని అతడు సమస్తములైన విదేశాలనుండి శిల్పులను రప్పించి పాతమాదిరిగా ఉన్నవన్నీ కొత్తపద్ధతిలోకి మార్చి కట్టవలసిందని ఆజ్ఞాపించాడు.

"ఓ! నిముషంలో మార్చేస్తాం! ఒక్క ఇరవైకోట్ల వరహాలు ఇలా పారేయించండి!" అన్నారు వాళ్ళు.

అబ్దుల్లా తన వజీరును పిలిచి, "వెయ్యో వెయ్, కొత్తపన్ను ఏదైనాను. ఇరవైకోట్లూ క్షణంలో వసూలుకావాలి!" అన్నాడు.

"ప్రభూ, ఎంతయిచ్చే ఆవుఐనా, అస్తమానం పితికితే పాలుఇస్తుందా! ప్రాణం విసిగి తన్నటం ప్రారంభిస్తుంది. అలాగే ప్రజలూను. చీటికీ మాటికీ పన్నులంటే వాళ్ళుమాత్రం యెక్కడనుంచి తెచ్చి ఇవ్వగలరు?" అన్నాడు వజీరు.



చక్రవర్తికి కోపంవచ్చి మంత్రిపైన కళ్ళెర్రచేశాడు. చేసేదిలేక మంత్రి వెళ్ళి, "నాలిక పన్ను" అనే పన్నువేసి, రాజ్యంలోని ప్రజలందరికీ ఈమోస్తరుగా చాటింపు వేయించాడు.

"చక్రవర్తిగారు రాజభవనాన్నీ, ఉద్యానవనాలనీ, లతామండపాలనీ పాత ఫక్కీ అంతా మార్చేసి కొత్తతీరుగా కట్టిస్తున్నారు గనుకనున్నూ, ఇందుకోసం ఇరవైకోట్ల వరహాలు కావలసివుంది గనుకనున్నూ, నోట్లో నాలుకవున్న ప్రతీమనిషీ—ఆడా, మొగా, పిల్లా, పెద్దా భేదంలేకుండా నూరేసి వరహాలుచొప్పున పన్నుక్రింద చెల్లించవల



సిందో హెూయ్. డమ్, డమ్. అలాగ చెల్లించకపోతే, చెల్లించనివాళ్ల నాలుకలు చక్రవర్తిగారు కోయించేస్తారో హెూయ్! డమ్, డమ్" అని.

ఈ చాటింపు వినపడేసరికి "అరి వీడి తల పగలా!" అని ప్రజలంతా చక్రవర్తిని లోలోపల తిట్టిపొయ్యడం ప్రారంభించారు. కాని ఇవ్వకపోతే, నాలుక కోయించేస్తాడేమో అన్న భయంకొద్దీ ప్రతీవాడూ సొమ్ము పోగుచెయ్యటం ప్రారంభించాడు.

ఇలావుండగా ఆ పట్టణానికి యెక్కడనుంచో ఒక ఫకీరు వచ్చాడు. అతడు భిక్ష కోసం ఇంటింటికీవెళ్లి "అల్లాహెూ అగ్బర్!" అని అరవటం ప్రారంభించాడు. కాని అతడికి యెవరూ భిక్ష వెయ్యలేదు.

అతడు "ధర్మం ఇలా నశించిపోయిందేమిటి? ఎక్కడడిగినా సొమ్మంటున్నారే!" అని ఆశ్చర్యపోయాడు.

"దమ్మిడీదగ్గిర్నుంచీ కూడదీసి నాలుక పన్ను కట్టాలి! నీకు ముష్టి ఎవరువేస్తారయ్యా?" అన్నాడొకడు.

అప్పుడు ఫకీరు సంగతంతా తెలుసుకున్నాడు. "రాజభవనంమీద పెట్టటానికని సొమ్ముకోసం ప్రజల్ని యిలా పీడించటమేమిటి? ఈ చక్రవర్తి కళ్ళు తెరిచేటట్టు చేయాలి!" అనుకున్నాడు ఫకీరు.

అతడు వెంటనే రాచనగరు ప్రవేశించాడు. "లోపలకు వెళ్లవచ్చా?" అని అతడు యెవ్వరినీ అడక్కుండానే సొంత ఇంట్లోకి వెడుతూన్నట్లు. చొరబడ్డాడు. ద్వారపాలకులు అతని ధైర్యానికి ఆశ్చర్యపోతూ, అడ్డుకోవడమే మరిచిపోయారు.

ఫకీరు లోపలకువెళ్ళి, అక్కడ కనపడ్డ ఒక నౌకర్ని 'స్నానాలగది యేదిరా అబ్బీ?' అని అడిగితెలుసుకుని, ఫాదుషా స్నానంగదిలోకి చొరబడి, నీళ్లుపోసుకు చక్కా వచ్చాడు. వచ్చి, 'భోజనాలసావిడి ఏదీ?'

అని వాకబుచేసి తెలుసుకొని, వెళ్ళి పీట వాల్చుకు కూర్చొని, 'వడ్డించవోయ్!' అని అక్కడున్న వంటవానికి ఆజ్ఞాపించాడు. చెప్పినట్లు చెయ్యకపోతే ఫకీరుకి కోపంవచ్చి ఎక్కడ శపించిపోతాడో అన్న భయంకొద్దీ వాడు అతనికి ఫాదుషాగారి బంగారు పళ్ళెరంలో పంచభక్ష్య పరమాన్నాలూ వడ్డించాడు.

ఫకీరు ఆరగించి లేచి, విశ్రాంతి భవనమెక్కడో వాకబుచేసి తెలుసుకుని, అక్కడకు పోయి, ఫాదుషా విశ్రమించే హంసతూలికా తల్పంమీద పరుండి గుఱ్ఱు ప్రారంభించాడు.




ఫకీరెవడోవచ్చి, రాచనగరును సొంత భవనంలాగ వాడుకుంటున్నాడని తెలియటంతోనే అబ్దుల్లా చక్రవర్తికి ఆశ్చర్యంవేసి, 'ఎవరుచెప్మా?' అనుకుంటూ వచ్చి చూశాడు.

ఫకీరు ఇంకా నిద్రపోతూనే వుండటం వల్ల సాహసించి ఫాదుషా అతణ్ణి లేపలేక పోయాడు. ఫకీరు లేచేవరకూ అక్కడ కనిపెట్టుకునివుండి, లేవటంతోనే, అబ్దుల్లా అతనితో, "స్వామీ, ఫకీర్లనిమిత్తం మేం కట్టించిన సత్రాలు యెన్నోవుండగా తమరు రాజభవనాన్నే ఉపయోగిస్తున్నారే!" అని అడిగేడు.

ఫకీరు యేమీ యెరగనట్టు, "ఇదికూడా సత్రం అనుకునే నేను ప్రవేశించాను" అన్నాడు.

"సత్రంకాదు మహాత్మా. మా తాత, తండ్రీ నివసించిన రాచనగరు. ప్రస్తుతం నేను ఉంటూవున్నది" అన్నాడు అబ్దుల్లా.

"ఒహో, ఐతే, మీతాత ఇందులో ఎంత కాలం ఉన్నాడు?" అని యదాలాపంగా అడిగాడు ఫకీరు.

"ఇరవై సంవత్సరాలు" అని జవాబిచ్చాడు అబ్దుల్లా.

"మీతండ్రి?" అని తిరిగి ప్రశ్నించాడు ఫకీరు.

"యాభై సంవత్సరాలు?" అన్నాడు అబ్దుల్లా.

"నువ్వు ఎన్నిసంవత్సరాలనుంచి ఉంటున్నావు?" అని మరొకప్రశ్నవేశాడు ఫకీరు.

"నా వయస్సు ముప్ఫైయేళ్లు. నేను పుట్టినప్పట్నుంచీ ఇక్కడే ఉంటున్నాను. జీవితాంతంవరకూ ఇక్కడే ఉండబోతాను" అన్నాడు అబ్దుల్లా.

"నువ్వు నూరు సంవత్సరాలు బ్రతుకు తావనే అనుకుందాము. అప్పుడింక డెబ్భై యేళ్లకన్న ఎక్కువకాలం ఈ భవనంలో నువ్వు ఉండవన్న మాటకదా" అని అదో రకంగా చూశాడు ఫకీరు.

ఫకీరు అలా ఎందుకంటున్నాడో అర్థం కాకుండానే పాదుషా, "చిత్తం!" అన్నాడు.

ఫకీరు తల్పంమీంచి లేచి, "పాదుషా! నేను చెప్పానే, ఇది సత్రంగాక మరే మిటి? నీ తాతా, తండ్రీకూడా ఇందులో కొంతకాలమే ఉండి వెళ్లిపోయారు! నువ్వు కూడా అలాగ కొంతకాలముండి పోయే వాడివేగాని ఇందులో శాశ్వతంగా ఉండ బోయేదిలేదు. అలాంటప్పుడు ఈ భవనం కోసం, కన్నబిడ్డలవంటి ప్రజల్ని పీడించట మెందుకు? ఈ సత్యాన్ని గుర్తించి ఇకనైనా వాళ్ల సొమ్మును వాళ్ల క్షేమంకోసమే వెచ్చించు" అని హితబోధచేస్తూ, "ఇంక నాకీ సత్రంతో పనిలేదు" అని అక్కడ నుంచి లేచి వెళ్ళిపోయాడు.

అబ్దుల్లా జ్ఞానంతెచ్చుకుని, వెంటనే "నాలుకపన్ను" తీయించివేశాడు. అంతే కాదు. నాటినుంచీ వెట్టిగా లోకుల సొమ్ము బలవంతంగా వసూలుచేసి ఆ భవనంకోసం వెచ్చించటంకూడా మానుకున్నాడు.






ద్రాక్షారామంలో వెంకటేశం అనే వృద్ధుడు ఒకాయన వుండేవాడు. ఆయన భార్యపేరు తులిశమ్మ. ఈ వృద్ధ దంపతులకి బాలాజీ అనే మనమడు ఒకడున్నాడు.

వెంకటేశంగారికి గోదావరిలంకపుగాకుతో తయారైన నస్యం అంటే మహాఇష్టం. రోజూ అర్ధణాపొడుం పీల్చేవాడాయన. అది బాలాజీయే తెచ్చిపెట్టేవాడు; తెచ్చిపెట్టినందుకు తాత ఒక కానీ లంచం యిచ్చేవాడు.

వెంకటేశంగారికి పొడుంపీల్చుకోవటం, వీలైనప్పుడల్లా ఒక కునుకు తియ్యటం, నిద్రరానప్పుడు మనమడితో కథలూ కబుర్లూ చెప్పటంతప్ప వేరే ఉద్యోగమేమీ లేదు. ఇంట్లో అన్నిపనులూ కోడలు అమిర్చిపెట్టేది గనుక, ఆ అమర్చినదానిలో వేలుపెట్టి, 'అది సరిగ్గా లేదు, ఇది సరిగ్గా లేదు' అంటూ గొణుక్కోడంతప్ప తులిశమ్మగారికీ వేరే పనే వుండేది కాదు.

ఇలావుంటూండగా ఆ గ్రామంలోవున్న భీమేశ్వరస్వామి ఆలయంలో రోజూ సాయంత్రం మూడుగంటలు లగాయతు గొప్ప పౌరాణికు డెవరో పురాణంచెపుతాడని తులిశమ్మగారి కోడలికి తెలిసింది. ఆమె అత్తగారితో, 'అత్తా, మీకు ఖాళీయే గనక రోజూ వెళ్లి పురాణం వినిరండి. వంటపని నేనుచూచుకుంటాను'' అంది. ఆ కాసేపైనా అత్తపోరు లేకుండా స్వతంత్రంగా పని చేసుకోవచ్చునన్న ఉద్దేశంతో ఆమె ఈ ఎత్తు వేసింది. అందుకు తులిశమ్మగారు "పురాణం వింటే పుట్టెడు పుణ్యం" అన్న నమ్మకంతో వెళ్లి శ్రద్ధగా వింటూవచ్చింది.

శాస్త్రుల్లుగారు పురాణం మాంచిబలేగా చెప్పేవాడు. తులిశమ్మగారికి అది బాగా నచ్చి, ఇంటికి వచ్చాక ఆవిడ కోడలితో, 'ఎంతబాగాచెప్పేరే! ఎంతబాగాచెప్పేరు!' అని తెగమెచ్చుకునేది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మద్రాసు



తులశమ్మ పురాణం వినటంవల్ల కలిగే ఆనందాన్ని వెంకటేశంగారికికూడా కలగజెయ్యాలని అనుకుంది. 'ఏమండీ, మీరుకూడా రండి!' అని పోరగా పోరగా ఆయన ఆ పోరు పడలేక సరేనన్నాడు.

కోడలు కాల్చిపెట్టిన మినపరొట్టె ఫలహారంచేసి ఆయనా, తులశమ్మా, బాలాజీ, గుడిమంటపం చేరుకున్నారు. స్త్రీలంతా కూచునేచోట తులశమ్మ కూర్చుంది. తాతా మనమడూ మగవాళ్ళు గనక రెండో పక్కన కూర్చున్నారు.

శాస్త్రుల్లుగారు మంచి తమాషాకథ ఒకటి చెప్పి అందరినీ నవ్వించారు. తులశమ్మ, తన ముసలాయనకూడా నవ్వి ఆనందిస్తున్నారో లేదో అని ఒక్కమారు భర్త కూర్చున్నవైపు చూసింది. అప్పుడు ఏం కనపడిందనుకున్నారు?

వెంకటేశంగారు పక్కనున్న స్తంభానికి ఆనుకొని హాయిగా నిద్రపోతున్నారు.

తులశమ్మ మనస్సు చివుక్కుమంది. వాళ్ళు సాయంకాలం ఇంటికి తిరిగివచ్చేటప్పుడు, 'అందరిలోనూ అలాగ నిద్రపోతే ఎలాగండీ? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు!' అని గొణిగింది.

బదులుగా వెంకటేశం 'ఆయన శ్లోకాలు వింటూంటే చిన్న కునుకు పట్టిందిగాని అస్తమానం అలా నిద్రపోతానా ఏమిటి? రేపటినించి చూడు ఎంత శ్రద్ధగా వింటానో!' అంటూ ఆవిడకి నచ్చచెప్పేడు. చెప్పేడేకాని మరునాడు పురాణానికి వెళ్ళి మళ్ళీ నిద్రపోయాడు. తులశమ్మ కనిపెట్టింది.

ఇంక ఆయనకిచెప్పి లాభంలేదనుకుంది. నలుగురిలోనూ ఆయన నిద్రపోకుండా ఉండటానికి ఏదైనా ఒక ఉపాయం చూడాలని ఆ రాత్రంతా బాగా ఆలోచించింది. తెల్లవారేసరికి ఆ ఇల్లాలి కొక చక్కటి ఉపాయం తట్టింది.

మనమణ్ణి రహస్యంగా పిలిచి, 'ఒరే వానీ, నీకో పని చెపుతా చేస్తావుట్రా?' అంది.

'ఏమిటి మామ్మా ?' అన్నాడు బాలాజీ.

'ఏంలేదు. పురాణంలో మీ తాతకి కునుకు వచ్చినప్పుడల్లా ఆయన్ని లేపుతూ ఉండాలి' అంది మామ్మ.

బాలాజీ, 'అలాగేగాని మామ్మా, ఇలా తేపినందుకు నాకు ఏమిటిస్తావు?' అన్నాడు.

'రోజూ ఒక కానీ ఇస్తాను' అని మామ్మ వాగ్దానంచేసింది.

యథాప్రకారం పురాణంలో తాత నిద్ర పోవడం జరిగింది. బాలాజీ తానుచేసిన వాగ్దానంప్రకారం, ఆయన్ని లేపేశాడు. మామ్మ కనిపెడుతూనే ఉంది. మనమడి ప్రజ్ఞకు మెచ్చుకుని ఇంటికి చేరుకోటంతోనే షరతుప్రకారం వాడిచేతిలో కానీ పెట్టేసింది.

రెండోరోజునకూడా తాత నిద్రపోవటం, బాలాజీ లేపటం జరిగింది. ఆ సాయంత్రం కూడా ఆమె మాటప్రకారం మనమడి చేతిలో రహస్యంగా లంచం పెట్టింది.

తన పన్నాగం బాగానే పారిందని తులిశమ్మ సంబరపడింది.

మూడోనాడు సాయంత్రం పురాణంలో కూర్చుని ఆవిడ యథాలాపంగా మొగుడి




వైపు చూసేసరికి ఆయన మళ్ళీ హాయిగా నిద్రపోతూ కనపడ్డాడు. అంతే కాదు; బాలాజీ ఆయన్ని లేపటానికి ప్రయత్నం చెయ్యకుండా ఆమె కేసి చూస్తున్నాడు. ఆవిడకి వళ్ళు మండిపోయింది! సాయంత్రం ఇంటికి చేరుకోటంతోనే వాణ్ణి పెరట్లోకి లాక్కెళ్ళి 'ఏమిరా, ఇవేళ తాతని లేపేవు కాదు!' అని గద్దించి అడిగింది.

'మామ్మా, తాతని లేపుతే నువ్వు ఒక్క కానీయే ఇస్తున్నావు. లేపకుండావున్నందుకు తాత నాకు అర్ధణా ఇస్తున్నాడు! ఇదుగో చూడు అర్ధణా. తాత అక్కడే ఇచ్చేశాడు!' అనేసి, తాయిల్లం కొనుక్కోటానికని పరుగెత్తేడు.




పూర్వం మిథిలాదేశాన్ని మందభాగ్యుడనే రాజు పాలిస్తూండేవాడు. అతడు ముక్కోపి, గర్వి. యుక్తాయుక్తాలూ సాధ్యాసాధ్యాలూ ఆలోచించకుండా, ఏక్షణంలో ఏది తోస్తే అది రాజాజ్ఞగా ప్రజలమీద ప్రయోగిస్తూ ఉండేవాడు.

ఒకనాడు మందభాగ్యుడు రాజప్రాసాదపు పైభాగాన చల్లగాలికి పచారుచేస్తూ, క్రింద రాజవీధిని నడుస్తూవున్న అనేక జనాల్నీ, వాళ్లు ధరించిన రకరకాల దుస్తుల్నీ, పరీక్షగా చూశాడు. వెంటనే అతడికో ఆలోచన తట్టింది. మంత్రిని పిలిపించాడు.

"మంత్రివర్యా!" అన్నాడు రాజు.

"ఏమిసెలవు మహారాజా!" అన్నాడు మంత్రి.

"అటు, రాజవీధివైపు చూడు! ప్రజలు ఎవరికి తోచినవిధంగా వాళ్లు ప్రవర్తిస్తున్నట్టు కనబడుతోంది. ఇది సహించరాని విషయం. ధరించే దుస్తులనుంచి, ప్రతిదాన్ని అందరు ప్రజలూ ఒకేవిధంగా అనుసరించాలి. ఆహారం, మాట్లాడేభాష, కొలిచేదైవం, అన్నీ ఒకటిగానే ఉండాలి. ఇది మా ఆజ్ఞగా తక్షణం మన రాజ్యమందంతటా చాటింపించు!" అన్నాడు.

వేషభాషల్లో, తిండితిప్పల్లో, భక్తివైరాగ్య విషయాల్లో ప్రజలందరిని ఒకే అచ్చులో తయారైన బొమ్మల్లా చేయడం సాధ్యమయ్యేదికాదని మంత్రి రాజుకు మనవి చేశాడు. ఊహుఁ! రాజాజ్ఞకు తిరుగులేదన్నాడు మందభాగ్య మహారాజు.

రెండు మూడు రోజులు గడిచినై. తను మంత్రికి యిచ్చిన ఆజ్ఞలు సరిగా చాటింపువేయించాడో లేదో, ప్రజలు వాటికి బద్ధులై ప్రవర్తిస్తున్నారో లేదో తెలుసుకోవాలనే కోర్కె మందభాగ్య రాజుకు కలిగింది. తన పాలనలోని ప్రతిఒక్కరూ ఆహార

కె. వడివేలు - అవయార్

విహారాలనుంచి ప్రతివిషయంలో ఒకేపద్ధతినీ, సాంప్రదాయాన్నీ అలవరుచుకుని అలా ప్రవర్తించిననాడు, ప్రపంచంలో తన పాలనకు ఒక విశిష్టమైనస్థానం ఆచంద్రార్కంగా వుండిపోగలదని అతడి కెంతో నమ్మిక కలిగింది.

ఒకనాటి వుదయం మందభాగ్యుడు వుద్యానవనానికి వెళ్లాడు. అక్కడ అతనికి కనుపించిన దృశ్యం అతడి మనస్సును కలతపరచింది.

దాసదాసీలంతా ఒకేరకమైన దుస్తులో వున్నారు. ఎవడు పురుషుడో, ఎవరు స్త్రీయో కూడా తెలుసుకోవడం అసంభవమై పోయింది రాజుకు. అక్కడినుంచి రాణివాసానికి వెళ్లాడు. అక్కడా యిదే పరిస్థితి. ఎవరు రాణులో, ఎవరు దాసీలో గుర్తుపట్టడం సాధ్యంకాలేదు. అందరూ ఒకే రకంగా దుస్తులూ, అలంకరణా చేసుకుని వున్నారు.

మందభాగ్యుడికి మతిపోయినట్టయింది. మంత్రిమీద ఎక్కడలేని ఆగ్రహం కలిగింది. సరాసరి దర్బారుహాలుకు వెళ్లాడు. అక్కడా అదేపరిస్థితి. మంత్రి ఎవరో, సేనానాయకుడెవడో, సేవకుడెవడో తెలుసుకోవడం కష్టమైంది. అందరిదీ ఒకేరకమైన వస్త్రధారణ.

"మంత్రీ!"అని గాండ్రించాడు రాజు.

"మంత్రీ!"అని తిరిగి గాండ్రించాడు మంత్రి.

"నేనా మంత్రిని? దుర్మార్గుడా!" అన్నాడు రాజు తీవ్రంగా. మంత్రి అదేమాటలను అంత తీవ్రంగా చిలకలా ఒప్పచెప్పాడు.

మందభాగ్యుడు తన అవివేకతకు సిగ్గుపడ్డాడు. మారుపలక్కుండా తన భవనానికి వెళ్ళిపోయాడు. మరునాడు, ఎవరికి యిష్టమైన వస్త్రధారణ వారు అనుసరించవచ్చునీ, యిష్టమైన దేవుణ్ణి కొలుచుకోవచ్చునీ రాజాజ్ఞగా చాటింపు జరిగింది.





# మంత్ర శక్తి

భైరవపుర జమీందారైన భైరవేశ్వర రాజావారు పెద్ద విందు ఏర్పాటుచేశారు. అందుకు కారణం వారు ఏ యుద్ధంలోనో గెలవడం మాత్రమే కాదు. వారి పందెపు గుర్రాల్లో ఒకటైన 'మేనక' గొప్ప పందెం గెలిచింది.

ఊళ్ళో అందర్నీ రాజావారు విందుకు ఆహ్వానించారు. పందేలలో ఆసక్తీ, అలవాటూ ఉన్నవారందరూ విందుకువచ్చారు.

వైభవంగా విందు జరిగిపోతోంది. రకరకాల ఆహార పదార్థాలతో, ఘాటైన పానీయాలతో గుమ్మెత్తిపోయి వచ్చినవారంతా గుక్క తిరక్కుండా మాట్లాడుతూ, కడుపులు చెక్కలయ్యేటట్టుగా నవ్వేస్తున్నారు.

ఉన్నట్టుండి ఒకమూల బయలుదేరిన చిన్న కలకలం పెద్ద గలభాగా మారింది. కోరమీసం అటు తిప్పిచూచారు రాజాగారు. కళ్ళు పెద్దవిచేసి తిలకించారు దివాన్‌జీ.

"చాలా ప్రమాదం; ప్రాణాంతకం కూడా!" అంటూ భగవతీరావు బల్లగుద్ది చెబుతున్నాడు.

"నీ మంత్ర తంత్రాల్లో, భూతవైద్యాల్లో నాకు కొంచెంకూడా నమ్మకంలేదు" అంటూ మోహనరావు ముసిముసినవ్వులు నవ్వుతున్నాడు. వారి చుట్టూ చేరారు విందుకు వచ్చినవారు.

రాజావారు దివాన్‌జీవంక చూచారు. దివాన్‌జీ చాలాకాలంనుంచి ఆస్థానంలో ఉంటున్నవారు కనక, రాజావారి చూపులలో వుండే అంతర్యాన్ని ఇట్టె గ్రహించివేశారు. ఆయన లేచి భగవతీరావూ, మోహనరావూ వున్న బల్లను సమీపించారు. చుట్టూ చేరినవారు నమ్రతగా పక్కకు తప్పుకొని దారిచేశారు.

"ఏమిటి తగువు?" అని అడిగారు దివాన్‌జీ.

డి. కృష్ణవేణి - బెంగళూరు

"మంత్ర తంత్రాల్లో ఈయనకు నమ్మకం లేదట!" అంటూ వురిమిచూచాడు భగవతీరావు మోహనరావువంక.

'అంతేనా?' అన్నట్టు దివాన్‌జీ మోహనరావు మొహంలోకి చూచారు.

"ఊహుఁ! నేను నమ్మను! చచ్చినా నమ్మను!!" అన్నాడు మోహనరావు.

"నిదర్శనం చూపితే మీ శక్తిని నమ్మవచ్చు" అని సలహా చెప్పారు దివాన్‌జీ.

భగవతీరావు దిగాలుపడ్డాడు. చేతులు నులుముకుంటూ "మంత్రతంత్రాల్లో, గజకర్ణ-గోకర్ణవిద్యలో దివాన్‌జీగారికీ నమ్మకం లేదన్నమాట!" అన్నాడు సంగిగా.

"నా నమ్మకంతో ఏంపని? నమ్మకం లేని మోహనరావును మీ మంత్రశక్తివల్ల ఏ పిల్లిగానో, కుక్కగానో మార్చేయండి" అన్నాడు దివాన్‌జీ. పక్కకు తిరిగి కుడికన్ను అదోలా ఎగరవేశాడు మోహనరావును ఉద్దేశించి.

"నాకు తెలిసినవి అలాంటిలాంటి మంత్రాలు కాదు. పచ్చి మళయాళీ మహమ్మారివి! తరవాత ఏమనుకున్నా..."

మోహనరావు, మధ్యలోనే భగవతీరావు మాటలకు అడ్డుపడి "అయితే నన్ను



కుక్కగానో పిల్లిగానో మార్చగలవన్నమాట!" అన్నాడు.

"పిల్లిగానో, కుక్కగానో మాత్రమేకాదు. కావాలంటే ఎలుగుబంటిగాకూడా మార్చివేయగలను. ఐతే, ప్రతిదానికి సమయమంటూ వుంది!" అన్నాడు భగవతీరావు, దివాన్‌జీవంక చూస్తూ.

దివాన్‌జీ నివ్వెరపోయినవాడిలా కళ్ళు తేలవేస్తూ చూచాడు.

"ఇంకా చీకటిపడేందుకు అరగంట మాత్రమే ఉంది. చీకటిపడగానే భగవతీరావుగారు మంత్రశక్తివల్ల మోహనరావుగార్ని ఎలుగుబంటిగా మార్చేస్తారు. విందుకు




వచ్చినవారంతా అప్పటివరకూ, ఇక్కడే ఉండి వేడుక చూడాలని నా అభిలాష" అంటూ దివాన్‌జీ అక్కడనుంచి వెళ్లి రాజావారి పక్కన కూర్చున్నారు.

విందుకు వచ్చినవారంతా గుసగుసలు ప్రారంభించారు. భగవతీరావుకు మంత్ర తంత్రాల్లోవున్న శక్తిసామర్థ్యాలను గురించి ఎవరికి తోచినట్లు వారు అనేకవిధాలుగా వాదించుకొన్నారు.

దివాన్‌జీ మోహనరావును పక్కకుపిలిచి ఏదో మాట్లాడారు. తరవాత ఆస్థానపు అడవి జంతువుల పాలనకు ముఖ్యుడైన భుజంగాన్ని పిలిచి ఏదో చెప్పారు.

చీకటి పడుతోంది. భగవతీరావుకు ఎదురుగా కూర్చుని మోహనరావు ఏదో ఆలోచిస్తున్నాడు. భగవతీరావు తల పంకిస్తూ, నొసలు ముడివేస్తూ, నానా యాతనా అనుభవిస్తున్నాడు.

కోరమీసానికి పురిపెడుతూ, రాజావారు కదలామెదలక అంతా చూస్తూ కూర్చున్నారు. దివాన్‌జీ మోహనరావుదగ్గరకు వచ్చి "మీరు భగవతీరావుగారి మంత్ర శక్తిని శంకించి, సవాలు చేశారు కనక, మీ మాటమీద నిలబడాలి. అదిగో! అగదిలోకి పదండి!" అంటూ మోహనరావును పక్కనవున్న ఒక గదిలోకి నడిపి తాళం వేశారు. భగవతీరావు బిత్తరపోయాడు.

దివాన్‌జీ అతడి భుజంమీద చేయివేసి "ఇక కానీండి! మీ శక్తిమీద నమ్మకం లేనివాళ్లకు మహిమ చూపి సరైన శాస్తి చేయండి. మోహనరావును ఎలుగుబంటిగా మార్చివేయండి!" అన్నాడు.

"నేనా...నేనా!" అంటూ భగవతీరావు వెలవెలబోయాడు.

"అవును, మీరే! తగిన శాస్తిచేయండి!" అని అంటూ దివాన్‌జీ తిరిగి రాజావారి పక్కన కూర్చున్నాడు.





భగవతీరావు తల వంచుకుని తనలో తను గొణుగసాగాడు. మోహనరావు బంధింపబడిన గదిలోనుంచి పెద్ద ఓండ్రింపు వినబడింది. అందరితోపాటు భగవతీరావూ భయకంపితు డయ్యాడు.

"సెహబాష్! సెహబాష్!" అంటూ దివాన్‌జీ లేచి నిలబడ్డాడు. భుజంగాన్ని పిలిచి గదితాళం తీయమన్నాడు.

ఆశ్చర్యం! తలుపుతాళం తీయగానే ఏనుగంత ఎలుగుబంటి వెనక కాళ్ళమీద నిలబడి ఓండ్రపెట్టడం అందరికళ్ళా బడింది.

"భగవతీరావుగారి మంత్రశక్తిని గురించి ఇక ఎవ్వరికీ అనుమానం లేదనుకుంటాను. అనుమానించిన మోహనరావుగారికీ, తిరిగి మానవస్వరూపం పొందగానే, అనుమాన రాహిత్యం అవుతుంది. భేష్! చాలు. ఇక ఎలుగుబంటిని మోహనరావుగా మార్చండి!" అన్నాడు దివాన్‌జీ.

భగవతీరావు కంపించిపోతూ 'ఆయన్ని ఎలుగుబంటిగా మార్చింది నేను కాదు' అన్నాడు.

రాజావారు చురకతిన్నవాడిలాగా చటుక్కున లేచి నిలబడ్డారు. "ఈ కోటలో ఇలాంటివేమీ సాగవు. మనుష్యుల్ని ఎలుగులుగా మార్చి, వాటిని అలాగే వదలడమంటే యెంత ప్రమాదమో అందరికీ తెలిసిందే. వాటికి మనిషి తెలివితేటలూ, ఎలుగుబంటి బలమూ వుంటుంది కనక, మనమంతా నాశనమైపోతాము. ఒక్క ఐదు నిమిషాల్లో, తిరిగి ఎలుగును మనిషిగా మార్చకపోతే, భగవతీరావుగారు రేపటి సూర్యోదయాన్ని చూడలేరు!" అంటూ గంభీరంగాచెప్పి రాజావారు తిరిగి కూర్చున్నారు.

అయిదు నిమిషాలకాలమూ మందంగా గడిచిపోయింది. రాజావారు కొరకొర

లాడారు. దివాన్‌జీ చురచుర చూస్తూ భగవతీరావును సమీపించి భుజం గట్టిగా పట్టుకున్నాడు.

"తిరిగి మనిషిగా మార్చేశక్తి లేనివాడివి, మోహనరావుగారిని ఎలుగుబంటిగా యెందుకుమార్చావ్?" అని గద్దించాడు.

భగవతీరావు వొళ్లంతా చెమటలుపోసినై. దీనంగా "అయన్ని ఎలుగుబంటిగా మార్చింది నేను కాదు. నా దగ్గర అంత మంత్రశక్తి లేదు. మంత్రాలకు చింతకాయలు రాలుతయా! ఏదో పొట్టకోసం అవీయివీ చెప్పి బతుకుతున్నాను" అన్నాడు నిట్టూరుస్తూ.

ఇందుకు వచ్చిన అందరివంకా చూస్తూ దివాన్‌జీ "విన్నారా భగవతీరావు మాటలు" అన్నాడు. "విన్నాం! విన్నాం!" అనే కేకలు మారుమోగినై.

మళ్ళీ భుజంగాన్ని పిలిచి గదితలుపు తాళంవేయమన్నాడు. ఓంగ్రపెడుతూవున్న ఎలుగుబంటిని అవతలకు అదలించి భుజంగం గదితలుపులు మూసి తాళం వేశాడు.

నాలుగైదు నిమిషాలసేపు గదివంక రెప్ప వాల్చకుండా చూసి, తనే స్వయంగా తాళం తీసి తలుపు తెరిచాడు దివాన్‌జీ. "వహవ్వా! వహవ్వా!" అన్నారు అందరూ. మోహనరావు నిబ్బరంగా నిలబడి అందరివంకా చూస్తున్నాడు. భగవతీరావు మరి ఆ ప్రాంతాలలో కనబడనేలేదు. ఇందుకు వచ్చిన జనమంతా దివాన్‌జీ మంత్రశక్తినిగూర్చి ఎంతగానో పొగిడారు. అంతర్యం తెలిసిన మోహనరావూ, భుజంగం, రాజావారు మాత్రం, నాటకం రక్తికట్టించినందుకు దివాన్‌జీ తెలివితేటలను మెచ్చుకుని ఊరుకున్నారు.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

**అడ్డము:**

1. బురద
3. స్వర్గము
5. చెట్టు
6. హద్దు
8. కుమార్తె
11. ఒక పనివాడు
12. నమస్కారము
14. స్తోత్రము
15. ఓణీ




**నిలువు:**

1. ఆధారము
2. కితాబు
3. పగలు
4. కర్తవ్యము
7. గుబ్బపు రౌతు
9. స్త్రీ
10. బోటు
11. శరీరము
13. ధనము

# వినోద చదరం



దిగువను ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఏడు మాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్ని మాటలలోను మొదటి అక్షరాలన్నీ ఒకే లాగ, చివరి అక్షరాలన్నీ మరొకలాగ వస్తయ్. దీనిని పూర్తిచేయగలరేమో చూడండి.

మీకు తెలియకపోతే జవాబుకి 54-వ పేజీ చూడండి.




**ఆధారములు:**

1. ఎద్దు
2. పాము
3. జండా
4. పక్షి
5. గాలి
6. దండు
7. చిగురు




## అగ్గిపెట్టెల్లో జండాలు

ఒకప్పుడు నా జేబులోంచి అగ్గిపెట్టె ఒకటి తీశాను. అందులో సిల్కుతో తయారైన చిన్న పాకీస్తాన్ పతాకం వుంది. రెండో జేబులోంచి మరొక అగ్గిపెట్టె తీశాను. అందులో సిల్కుతో తయారైనదే మన జాతీయపతాకం వుంది. ఇది ప్రేక్షకులకు చూపి, దేనిలో యే పతాకం వున్నదీ వాళ్లను జ్ఞాపకంపెట్టుకోమన్నాను. నా మంత్రదండం రెండు అగ్గిపెట్టెలకూ ఒక్కసారి తాకించాను. ఆశ్చర్యమేమిటంటే పాకిస్తాన్ పతాకంవున్న అగ్గిపెట్టెలోకి మన జాతీయ పతాకం, జాతీయపతాకంవున్న అగ్గిపెట్టెలోకి పాకీస్తాన్‌పతాకం బదిలీ అయినై.

అప్పుడు నేను 'మనమంతా సోదరులం- మనలో మనకు విరోధాలు వుండకూడదు. అందరం ఒకటే. ఇదుగోచూడండి—' అని ఆ అగ్గిపెట్టెలను వారికిచూపి, మళ్లీ టేబిల్ మీదపెట్టాను. మళ్ళీ మంత్రదండం తాకించాను. మొదట్లో వున్నట్లు పాకిస్తాన్‌పతాకం వుండిన అగ్గిపెట్టెలోకి పాకీస్తాన్ పతాకం, జాతీయపతాకం వుండిన అగ్గిపెట్టెలోకి జాతీయపతాకం వచ్చేశాయ్. ఇదిచూచి అందరూ తెల్లబోయారు.




అగ్గిపెట్టెలను ముందు జాగ్రత్తగా తయారుచేసుకోవాలి. ఈ పైన వున్న చిత్రంలో చూడండి. ఇందులో '1' గుర్తుగల పెట్టెలో మన మూడురంగుల జాతీయ పతాకం, '2' గుర్తుగల పెట్టెలో పాకీస్తాన్ పతాకం వున్నాయి. ఈ పెట్టెలను ముందు ప్రేక్షకులకు చూపించి, మళ్ళీ బల్లమీద పెట్టేప్పుడు బోర్లవేసిపెడితే '1' గుర్తుగల

పెట్టెలోంచి పాకీస్తాన్ పతాకం, '2' గుర్తు గల పెట్టెలోంచి జాతీయపతాకం బైటపడతాయి. ఈ విభాగాన్ని ఎలా తయారుచేసుకుని వుంచుకోవాలో '3' గుర్తుగల చిత్రంలో చూడవచ్చు.

ముందు మనం ఖాళీ అగ్గిపెట్టెలను తీసుకువచ్చి వాటిని కాస్సేపు నీళ్లలో నానబెట్టి వాటిమీదవున్న లేబిల్స్‌ను చిరిగిపోకుండా ఊడతీసి, ఆ తడిని అద్దుడు కాగితంతో అద్దేసెయ్యాలి. మనం ఉపయోగించతలుచుకున్న అగ్గిపెట్టెలకు—ఈ వూడతీసిన ఒకేరకం లేబిల్స్‌ను వెనుకవైపున ముందువైపునకూడా అతికించాలి. అలా అతికిస్తే మనం అగ్గిపెట్టెను వెనక్కి తిప్పుతున్నదీ, ముందువైపునకు తిప్పుతున్నదీ ప్రేక్షకులు తెలుసుకోలేరు. లోపల అసలు అగ్గిపుల్లలుండే పెట్టె అడుగు భాగాన్ని వూడతీసి పారెయ్యాలి. దానికి '3' చిత్రంలో చూపినట్లు అరలను ఏర్పరచుకోవాలి. పైకి కనిపించే అరలో ఒక పతాకం, అడుగువైపునవుండే అరలో మరొక పతాకం అమర్చి వుంచుకోవాలి. అప్పుడు ఒకే అగ్గిపెట్టెను యెదరవైపుతీస్తే ఒక పతాకం, త్రిప్పి రెండోవైపున తీసిచూపిస్తే మరొకపతాకం కన్పిస్తాయి.

ప్రేక్షకులకు, ముందు ఈ అగ్గిపెట్టెలో ఈ పతాకం, ఈ అగ్గిపెట్టెలో ఈ పతాకం వుందని చూపించగానే వాటిని మళ్ళీ బల్లమీద పెట్టేప్పుడు తలకిందులుగా పెట్టాలన్నమాట. కావాలంటే రెండు అగ్గిపెట్టెల్లోనూ జాతీయ పతాకాన్నే చూపవచ్చు. రెండింటిలోనూ పాకీస్తాన్‌పతాకాన్నే చూపించవచ్చు.

---

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్

12/3/A, జమీర్‌లేన్, బాలిగంజ్,

కలకత్తా - 19

---

### హాంగ్‌కాంగ్‌లో చందమామ

ఆసియా దేశాలలో సంచారంచేస్తూన్న మన సర్కారు, చందమామను అభినందిస్తూ చీనా నుండి ఉత్సాహపూరితమైన జాబువ్రాశారు. చీనాదేశస్థులు వారి ప్రదర్శనాలుచూచి జేజేలు కొట్టుతున్నారట. మన సర్కారుకు విస్మయం, సంతోషం కొల్పిన వింత మరొకటి వున్నది. హాంగ్‌కాంగ్‌నగరంలో ఆయన చందమామలను చూచారట! కనుకనే, సర్కారు ఎక్కడ వుంటే చందమామ అక్కడే వుంటున్నదని ఏనాడో చెప్పివున్నాము.

# అట్టమీది బొమ్మ

కుచేలుడు ఒక పేదబ్రాహ్మడు. అతడు జితేంద్రియుడూ, కలిగినదానితో తృప్తిచెందేవాడున్నూ. ఐతే దారిద్ర్యానికితోడు కుచేలునికి గంపెడు పిల్లలు. ఈ పిల్లలతో కుటుంబం ఈదుకోవటం దుర్ఘటంగా ఉండేది.

కుచేలుడూ కృష్ణభగవానుడూ బాల్యమిత్రులు, సహపాఠులున్నూ. ఒకనాడు కుచేలుని భార్య, భర్తతో "నాథా!—కేవలమూ ఆ లక్ష్మీపతి మీకు సఖుడుకదా! ఆయన శరణాగత రక్షకుడని బిరుదు పొందినవాడే! ఒక్కసారి పోయి ఆ మహానుభావుని దర్శనంచేయకూడదా? ఆయన తలచినంతలో మన దారిద్ర్యం పటాపంచలగునే!" అని వినయంగా కోరింది.

ఈ రూపకంగానైనా దేవదేవుని సందర్శనభాగ్యం కలుగుతుందని తలిచి కుచేలుడు అంగీకరించాడు. భగవానుడివద్దకు పోవాలంటే ఎటువంటి బహుమతులు తీసుకువెళ్ళాలి! ఏమీ తోచక కుచేలుడిభార్య నాలుగిళ్లకుపోయి నాలుగు పిడికెళ్లు అటుకులు దండితెచ్చి, వాటిని జాగ్రత్తగా మూటకట్టి భర్తకు ఇచ్చింది.

కుచేలుడు ఆ మూటను భక్తితో చేతపట్టుకొని కృష్ణుడు నివసించే ద్వారకానగరం చేరుకున్నాడు. కుచేలునిరాక తెలియగానే శ్రీకృష్ణుడు శయ్య దిగివచ్చి బాల్యమిత్రుని స్వయంగా తోడ్కొనివెళ్ళి తనపక్కమీద కూర్చోపెట్టుకున్నాడు. ఉభయులూ మనసువిడిచి కుశలప్రశ్నలు వేసుకొన్నారు. చిన్ననాటి ముచ్చటలూ, చదువుకొనేనాటి చిలిపిచేష్టలూ జ్ఞాపకంతెచ్చుకొన్నారు. కుచేలునికి శ్రీకృష్ణుడు పాదసేవ చేశాడు, రుక్మిణి వీవనతో విసిరింది. చివరకు కృష్ణుడు 'ఏమిటోయి కుచేలా!—మరి నాకేం తెచ్చిపెట్టావు?' అంటూ, అతనిచేతిలోని మూటవిప్పి, అప్యాయంతో ఆ అటుకులు తిన్నాడు. ఇదిచూచి అందరూ విస్మయం పొందారు.

మరునాడు కుచేలుడు తన గ్రామం చేరుకొనేసరికి తన పూరిల్లు ఒక దివ్య సౌధంగా మారిపోయింది, మెడబొందుతో వుండిన అతని భార్య సమస్తమైన అభరణాలతోనూ తులతూగుతున్నది. కృష్ణుని మహిమవల్ల ప్రాప్తించిన ఈ ఐశ్వర్యం అనుభవిస్తూ, కుచేలుడు సుఖంగా వున్నాడు. ఇంత ఐశ్వర్యం వచ్చినా భగవంతుని మరువక, అజన్మాంతమూ కృష్ణభక్తుడుగా ఉండి తరించాడు.

# రంగుల బొమ్మ కథ—4-వ బొమ్మ

ఉద్యానవనంలో జరిగిన విచిత్ర విషయాన్ని తలచుకొంటూ శాన్‌మింగ్ యిల్లు చేరుకున్నది. అవునా?–అయితే ఇది తలిదండ్రులకు రవంతైనా తెలియనివ్వలేదు. ఆ రాత్రల్లా ఆమె తనగదిలో కూర్చుని ఈ విషయాన్నిగురించే ఆలోచించసాగింది. అలా ఆలోచిస్తూండగా "ఇందుకు కారణం ఏమైవుంటుందీ?" అనే మాటలు ఆమె నోటినుండి అప్రయత్నంగా వెలువడినై.

ఎప్పుడైతే శాన్‌మింగ్ యిలా అన్నదో, గదిగోడ వంకెకు తగిలించివున్న ఆ చిత్రమైన గొడుగు కదులుతూ "ఆమాత్రం గ్రహించలేవూ? నీ మేలు కోరే అలాచేశాను. నీకు తనగి వరుడు ఎవరో నాకుతెలుసు. అలాంటి వ్యక్తి దొరికే వరకు యిలాగే జరుగుతూవుంటుంది. తగినవరుడు తటస్థపడిననాడు నేను కదలక మెదలక ఊరుకునేవుంటాను. ఈసంగతి గుర్తుంచుకో" అని పలికింది.

ఈ పలుకులు విన్నప్పటినుంచి శాన్‌మింగ్ ఆశ్చర్యానికి అంతులేదు. గొడుగేమిటి? మాట్లాడటమేమిటి? సరే చూదాం అనుకొని ఈవిషయంకూడా తలిదండ్రులకు తెలియనియ్యకుండా మనసులోనే దాచివుంచుకున్నది. మరునాడు ఆమె తండ్రి స్నేహితుడు కుమారునితో సహా వెళ్ళిపోయాడు.

మరికొన్నాళ్లతరువాత ఒకరోజున శాన్‌మింగ్ ఉద్యానవనంలో విహారానికి వెళ్లి, తనకు తెలియకుండానే వనం దాటి చాలదూరం వెళ్ళిపోయింది. పోయిపోయి ఒక అడవి చేరుకున్నది. కొంతసేపటికి దారితప్పివచ్చినట్టు తెలుసుకుని కంగారుతో తిరుగుముఖంపట్టి, త్వరత్వరగా అడుగులువేసుకుంటూ యింటికి బయలుదేర బోయింది. ఇంతలో ప్రక్కనుంచియెవరో తన చేతిని పట్టివేసినట్టయింది. శాన్‌మింగ్ భయంతో వణికిపోయింది. గజగజలాడుతూ తిరిగి చూచేసరికి, చెట్టు ఆకారంలో వున్న ఒక భయంకర స్వరూపం కనుపించింది. ఆ తర్వాత ఏంజరిగిందీ బొమ్మతోసహా వచ్చేనెల చందమామలో చదవండి.

# ఒంటిగీత బొమ్మ



పంపినవారు : యస్. యస్. వెంకటసుబ్బయ్యా - తిరుపతి

## పజిలుకి జవాబు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 ఊ | 2 బి | ■ | ■ | ■ | 3 ది | 4 వి |
| 5 త | రు | వు | ■ | 6 అ | వ | ధి |
| ■ | దు | ■ | 7 సా | ■ | ము | ■ |
| ■ | ■ | 8 దు | హి | త | ■ | ■ |
| ■ | 9 సు | ■ | ణి | ■ | 10 ప | ■ |
| 11 మే | ద | రి | ■ | 12 దం | డ | 13 ము |
| 14 ను | తి | ■ | ■ | ■ | 15 వ | ల్లె |

## వినోద చదరానికి జవాబు :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ప | స | ర | ము |
| 2. | ప | న్న | గ | ము |
| 3. | ప | తా | క | ము |
| 4. | ప | తం | గ | ము |
| 5. | ప | వ | న | ము |
| 6. | ప | టా | ల | ము |
| 7. | ప | ల్ల | ప | ము |



ఇప్పుడే వెలువడింది

## మరి రెండుభాషలలో
## చందమామ

★

తెలుగు, తమిళ, కన్నడ, హిందీ ప్రాంతాలలో
మా పాఠకులు పొందుతూవున్న ఆనందాన్ని
ఈ ఉగాదినుండి

**అంబిళి అమ్మావన్** (మళయాళం) | **చాందోబా** (మహారాష్ట్రం)

పత్రికలద్వారా
కేరళ, మహారాష్ట్ర ప్రాంతాలలోని
బాలబాలికలకూ అందజేస్తున్నాము



## CHANDAMAMA PUBLICATIONS
2 & 3. ARCOT ROAD, KODAMBAKKAM, MADRAS-24.




Printed by B. NAGIREDDI at the B. N. K. Press Ltd., Madras 24, and Published by him from Chandamama Publications, Madras 24, Controlling Editor : SRI CHAKRAPANI





Photo by A. L. Syed

నే నే!

CHANDAMAMA (TELUGU) APRIL 1952 REGD. No. M. 4854




రంగులబొమ్మ కథ—4-వ బొమ్మ